శ్రీరస్తు:

# శ్రీ కృష్ణాపుష్కర మహిమాకథావళి.

ఇది

విచిత్రాష్టావధాని, విద్వత్కవి, నాటకచక్రవర్తి బిరుదాంకితులును,
విజయవాడ పురస్థిత శ్రీ కన్యకాపరమేశ్వరీ హిందూ
హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులును, అగు,

బ్ర॥ శ్రీ మల్లాది అచ్యుత రామశాస్త్రిగారిచే
రచియింపఁబడి

బెజవాడ శ్రీ సరస్వతీ బుక్ డిపో
ప్రొప్రయిటరగు

కురుకూరి సుబ్బారావుచే
ప్రకటింపఁబడినది.

మొదఁటికూర్పు 2,000 ప్రతులు.

వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1933.





వెల 0—12—0.

# ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచియింపఁబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| జానకీశపథము | 1-0-0 | గజేంద్రమోక్షము | 0-8-0 |
| రుక్మిణీకల్యాణము | 0-12-0 | ప్రహ్లాదచరిత్రము | 0-8-0 |
| మార్కండేయోపాఖ్యానం | 0-12-0 | పై 8 పుస్తకములు కలిసి | |
| హరిశ్చంద్రోపాఖ్యానం | 0-12-0 | కాలికోబయిండు | 5-8-0 |
| అంబరీషచరిత్ర | 0-8-0 | సావిత్రీ చరిత్రము | 0-12-0 |
| భీష్మచరిత్రము | 0-8-0 | యథార్థ రామాయణం | 2-8-0 |

## బి. బాలాజీదాసుగారిచే రచియింపఁబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| గయోపాఖ్యానం | 0-8-0 | | |
| జయప్రదాదేవి చరిత్ర | 0-8-0 | సంగ్రహరామాయణ | 1-0-0 |
| నలచరిత్రము | 0-8-0 | ద్రౌపదీమానసంరక్షణ | 0-[illegible]-0 |
| రుక్మాంగదచరిత్ర | 0-[illegible]-0 | ప[illegible]లోపాఖ్యానం | 0-6-0 |
| త్రిశంకువిజయమను హరిశ్చంద్ర | 0-8-0 | పురందరదాసుచరిత్ర | 0-6-0 |
| కుశలవవిజయము | 0-8-0 | సూరదాసుచరిత్ర | 0-6-0 |
| శశిరేఖాపరిణయము | 0-8-0 | కర్ణానందబాయి | 0-6-0 |
| సీతాకల్యాణము | 0-8-0 | హరికథేతిహాసమంజరి పు 1 | |
| దయాకరవిజయం | 0-8-0 | పద్యములు | [illegible]-[illegible]-0 |
| భద్రాచల రామదాసుచరిత్ర | | డిటో రెండవభాగం కీర్తనలు | 0-6-0 |
| చల్లా రామలింగయ్యగారిది | 0-[illegible]-0 | | |

## తిరునగరి శేషదాసుగారి హరికథలు.

| | | | |
|---|---|---|---|
| శ్రీరామపాదుకాపట్టాభిషేకము | 0-8-0 | శ్రీమదుత్తరరామచరిత్ర | 0-[illegible]-0 |
| సీతాపహరణము | 0-8-0 | సుభద్రాపరిణయము | 0-[illegible]-0 |

## బాబూ పి. యస్. సౌమర్ వార్జీకవిగారిచే రచియింపఁబడిన

| | | | |
|---|---|---|---|
| శ్రీ కబీరుదాసుచరిత్ర | 1-0-0 | సీతాకల్యాణము | 1-4-0 |
| శ్రీరామజననము | 1-0-0 | వైజయంతీవిలాసము | 1-0-0 |

వలయువారు:—

సరస్వతీ బుక్కు డిపో, బెజవాడ.

శ్రీరస్తు.

# శ్రీ కృష్ణాపుష్కర మహిమాకథావళి.

ఇది

విచిత్రాష్టావధాని, విద్వత్కవి, నాటకచక్రవర్తి బిరుదాంకితులును,
విజయవాడ పురస్థిత శ్రీ కన్యకాపరమేశ్వరీ హిందూ
హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులును, అగు,

బ్ర॥ శ్రీ మల్లాది అచ్యుత రామశాస్త్రిగారిచే

రచియింపఁబడి

బెజవాడ శ్రీ సరస్వతీ బుక్ డిపో
ప్రొప్రయిటరగు

కురుకూరి సుబ్బారావుచే
ప్రకటింపఁబడినది.

మొదఁటికూర్పు 2,000 ప్రతులు.

వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1933.





వెల 0—2—0.

# విషయసూచిక.


| విషయము. | | పుట సంఖ్య |
|---|---|---|
| 1 పుష్కరోత్పత్తి | ... | 1 |
| 2 పుష్కరదినములలో చేయుదానములు | ... | 7 |
| 3 పుష్కరశ్రాద్ధలక్షణము | ... | 15 |
| 4 పిండప్రదానవిధి | ... | 15 |
| పుష్కరము 12 దినములలో చేయవలసిన దానములు మంత్రములు ఏరోజున, ఏదానము ఇవ్వవలసినది. వాని శ్లోకముల వివరము వాని ఫలితములు. | ... | |
| 1 మొదటిరోజు కథ భూదానమహిమ | ... | 22 |
| 2 రెండవరోజుకథ ఫలదానమహిమ | ... | 25 |
| 3 మూడవరోజు కథ గోదానమహిమ | ... | 29 |
| 4 నాల్గవరోజుకథ; తైలదానమహిమ | ... | 32 |
| 5 ఐదవరోజుకథ; వృషభదానమహిమ | ... | 37 |
| 6 ఆఱవరోజుకథ; కర్పూరదానమహిమ | ... | 40 |
| 7 ఏడవరోజు కథ; గృహదానమహిమ | ... | 43 |
| 8 ఎనిమిదవరోజుకథ; (అల్లము) ఆర్ద్రకదానమహిమ | ... | 47 |
| 9 తొమ్మిదవరోజు కథ; (శ్రాద్ధము) పిండదానమహిమ | ... | 51 |
| 10 పదియవరోజుకథ సాలగ్రామదానమహిమ | ... | 55 |
| 11 పదునొకండవరోజు కథ దాసీ దానమహిమ | ... | 59 |
| 12 పన్రెండవరోజుకథ యుజాదానమహిమ | ... | 65 |
| ఫలశ్రుతి పద్యము. | | 67 |




# కృష్ణాపుష్కర నిరూపణ.

శ్లో॥ నమ్యాజే, తేనమస్తుభ్యం । మహాదేవస్య వల్లభే ।
త్వద్భక్తి మంశం దేవి । దేహికృష్ణా మహానదీ॥

నారదః॥ భగవన్ దేవదేవేశ । సర్వజ్ఞకరుణాకర త్వత్తః శ్రుత మశేషంహి । కృష్ణామహాత్మ్య ముత్తమః కథంవ్రత విధిః కార్యా । కన్యాయుక్తే బృహస్పతౌ । కః పుష్కరః కస్యపుత్రః । కామానాపూరణం కథం । తీర్థరాజః కథంజాతః । కథంపాపవనోదకం । ఏతత్సర్వ మశేషేణ । వక్తుమర్హసి సాంప్రతం॥

టీక — నారదుం డొకనాఁడు బ్రహ్మదేవుని యీ విధముగా ప్రశ్నచేసెను. ఓ జనకా! నీవలన కృష్ణానదీ మహిమ పరిపూర్ణముగా విన్నాను. పుష్కరమనగా నెవరు? పుష్కరుని తండ్రియెవరు. పుష్కరుఁడు తీర్థరాజెట్లయ్యెను. పుష్కరము నందేమి చేయవలయును. సర్వము నాకు సవిస్తరముగాఁ జెప్పుమని.

బ్రహ్మ॥ తిస్రః కోట్యర్థ కోట్యశ్చ, యానితీర్థాని సంతివై, యత్రోత్పన్నాని పుణ్యాని, తత్తీర్థం పుష్కర స్మృతః। పురాతుందిలకో నామ । మునిః పరమధార్మికః । ఆద్యంత రహితం శంభుమర్చ యిత్వా దివానిశం । లబ్ధ్వాప్రసాదం శంభోర్వై । సతుపుష్కర తాంగతః । శివానుగ్రహ సామర్థ్యా దీశ్వరస్యాష్ట మూర్తిషు । జలరూపం సమాసాద్య । శివేచాశ స్థితే సదా । పుష్కరః పుష్కరాత్మకః । కామనా పూరణక్షమః॥

టీక — పూర్వము తుందిలుడను బ్రాహ్మణుఁడు శివునిగూర్చి చిరకాలము తపస్సుచేసి, శివునియొక్క యెనిమిది రూపములలో నొకటియగు, జలరూపము నంది శివానుగ్రహమువలన, పుష్కరుడను పేరొందెను.

శ్లో॥ పశ్చాదహంత వస్తప్త్వా । సమారాధ్య శివంకరం । స్తుత్వా సామ్నాం సమూహేన । లోకస్యాష్టర్థ మీశ్వరం । అయాచిషమదా

తోసపి । పుష్కరం తీర్థరూపిణం । అహంకమండ లౌస్థాప్య జగత్కా
ర్యం కరోమ్యహం॥

టీక—తరువాత శివుని ప్రార్థించి లోక సృష్టి కొఱకు పుష్క
రుని తెచ్చుకొని కమండలమందుంచుకొని, జగత్తులను సృష్టించు
సామర్థ్యము సంపాదించుకొంటిని.

శ్లో॥ కదాచి దథకాలేన । బృహస్పతిరుదారధీః । పుత్రోహ్యాం
గిరసస్సాక్షు ద్బ్రహ్మా ద్బ్రాహ్మణోత్తమః తపఆస్థాయ పరమం । దుశ్చ
రంమామతోషయత్ । ప్రసన్నోహం । మునింద్రష్ట్వా ! వరం వర
యసువ్రత॥

టీక—ఒకానొకప్పుడు అంగిరస మహాముని కొడుకు బృహ
స్పతి తపస్సుచేసి నన్ను మెప్పించగా సంతోషించి నీవు కావలసిన
కోరిక కోరుమని చెప్పితిని.

శ్లో॥ యదిప్రసన్నో దేవేశ! । కృపాయది దయానిధే । గ్రహాధి
పత్యం మాన్యత్వం । సర్వజ్ఞత్వంచ దేహిమే । త్వత్కమండలు సం
స్థోయం । తీర్థరాజస్తు పుష్కరః । సోపిమద్వశ గోభూత్వా । తిష్ఠే
దేవం, వరోమమ॥

టీక—అంతట బృహస్పతి నమస్కరించి. అయ్యా; నాయం
దు తమకుకృపగలిగినచో నాకు గ్రహాధిపత్యము, దేవతలలో గౌర
వము, నీకమండలములోని పుష్కరుని, నాకొసగుమని ప్రార్థించెను.

శ్లో॥ ఏవమస్త్వితి తంచోక్త్వా । బృహస్పతి మతోషయత్,
పుష్కరంతు సమాహూయ వచనంచేదమబ్రవీత్ । త్వం పుష్కర
మహాబుద్ధే। బృహస్పతి మనువ్రజ॥

టీక—అప్రకారము వరమునిచ్చి, పుష్కర మహామూర్తిని
పిలిచి, బృహస్పతికి నిన్నొసంగితిని. ఇంతటినుండి వాని ననుసరించు
మని చెప్పితిని॥

పుష్కరుండు—శ్లో॥ ఇత్యుక్తః పుష్కరశ్చాహ । నమంచా
మిత్వదంతికం । త్వమేవశరణం మన్యే । త్వద్వియోగోతిమస్సహః,

టీక—అంతట పుష్కరుడు నేనుమిమ్ముల్లను విడిచిమనజాలను.
అట్లుచేయుట నాకు మిగుల కష్టము.

బ్రహ్మ— శ్లో॥ బృహస్పతే ప్రవర్తస్వం । అతోయా హిమమాజ్ఞయా॥

టీక— నిన్ను బృహస్పతికి నిచ్చినాను నాయాజ్ఞాప్రకారము నీవు సురాచార్యునివెంట జరక తప్పదని బ్రహ్మ, వచియించెను.

పుష్కర—శ్లో॥ పునరాహచ పుష్కరాఖ్య । ఆయాతశ్చేత్వ మేవహి । త్వయాసాకంగమిష్యామి । యత్రయత్రగమిష్యసే॥

టీక—అయ్యా మిమ్ముల విడువజాలను. తాము యెచ్చటెచ్చటికేగిన, నచ్చటచ్చటకు నేనుగూడ వచ్చెదననెను.

బ్రహ్మ—శ్లో॥ ఇత్యుక్తః పుష్కరం దృష్ట్వా । పునరాహ మునీశ్వరాః యదారాశి ప్రవేశస్యా తదాప్రభృతి సర్వదా । ద్వాదశాహమితేకాలే । వస్తవ్యంతు మమాజ్ఞయా। ఆవత్సరంతు వస్తవ్యం! మధ్యాహ్నే ద్విముహూర్తకం । అంతే ద్వాదశవస్తవ్యం ! దినానిత్వం యదాసుఖం । ఇత్యాజ్ఞాప్యాథభగవాన్ తూష్ణీం భూతోహిపద్మజః॥

టీక—ఓ పుష్కరుడా! బృహస్పతి యేరాశియందు, యెప్పుడుచేరునో, యాదినము మొదలు పన్నెండుదినములు రాత్రింబవళ్ళును సంవత్సరపర్యంతము మధ్యాహ్నము నిత్యము రెండుగడియల స్నర కాలమును సంవత్సరాంతమునందు తిరిగి పండ్రెండు దినములును, నీతోకూడ నుండెను. కావున, నీవు బృహస్పతిని, యనుసరించి యుండుము. ఆ సమయమునందు ముప్పదిమూడుకోట్ల దేవతలు బృహస్పతితోగూడ వచ్చియా నదియందు నాతోగలసియుందురు.

శ్లో॥ పుష్కరాఖ్యం సమాహూయ । బృహస్పతి రతంద్రితః। మేషాదిరాశి ష్వస్థిత్వా। చరిత్వావత్సరం క్రమాత్।. ఏవంద్వాదశ వత్సరాత్మకమితేకాలే । సదావర్తతే । పుత్రోహ్యం గిరసస్య వేదలిదయం । బ్రహ్మాండ భాండోదరే యాసద్యస్య కలేష్టదాస్సులలితాః। నత్పుణ్య పుంజాః వరాఃతాసు, స్నాతి యదాముసింద్రసహితాః। కాలో మహాపుణ్యదః.

టీక—బృహస్పతి పుష్కరుని పిలుచుకొని, మేషాదిరాసులలో ప్రవేశించుచునేడాదికి నొక రాశిచొప్పున పండ్రెండు వత్సరముల కాలములో భూలోకములోగల మహా పుణ్యనదులలో

పుష్కరుని బ్రవేశింపఁజేయును. ఆకాలము గొప్ప పుణ్యకాలము గంగ మొదలుకొని, రాగా కన్యారాశిలో బృహస్పతి బ్రవేశించి నపుడు కృష్ణాపుష్కరమగును.

శ్లో॥ ఆయాంత్యంగి రసోయత్ర। తత్రాగచ్ఛతి పుష్కరః। నద్యస్సమస్తా ఆయాంతి। తీర్థాన్య పిశివాజ్ఞయా। బ్రహ్మారుద్రశ్చ విష్ణుశ్చ। రుద్రశ్చ, ఇంద్రాద్యాస్సర్వదేవతాః। పితరోఋషయశ్చైవ। స్నాత్వాత్రనివసంతిహి। తత్రదత్తంతు యద్రవ్యం అక్షయం భవతిధృవం॥

టీక—బృహస్పతి వచ్చినచోటికి పుష్కరుఁడు వచ్చును. బ్రహ్మయు, విష్ణువు, రుద్రుఁడు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, మునులు వత్తురు. కావున నా పండ్రెండుదినములు స్నానము, దానము, శ్రాద్ధము కోటి గుణితమగును.

కృష్ణాపుష్కరమునందు ముఖ్యముగాఁ జేయవలసిన విధి.

శ్లో॥ యస్మిన్ దినేతుకన్యాయాం। రాసౌజీవే సమాగతే। తస్మిన్ దినేతు కృష్ణాయాం। వపనం చోపవాసకం। అన్యదేశస్థితానాంతునతుతత్తీరవాసినాం। తీర్థవాసీనరోయస్తు గత్వాన్యం విషయం యదిమాణ్మాసాంతంచవర్షాంతం। స్వదేశంచల భేన్యతి।తీర్థశ్రాద్ధప్రకుర్వీత, ముండనంనోపవాసకం। కృష్ణవేణ్యోభయతటే। యోజనాద్వంతరేస్థితం। తత్క్షేత్రం ముక్తిదంప్రాహుర్గర్గకశ్యపదేవలాః। ధర్మపత్న్యాంచగర్భిణ్యాం। మాంగల్యేనాపి వాకృతే। వపనంప్రాహురాచార్యాఃసింహేకన్యాగతే గురౌ। సింహేగుణ, గౌతమి, కృష్ణకన్యాస్తుదైవకన్యాగత దేవపూజ్యే। తత్రైవయాత్రా అపిగుర్విణీనాం। వివాహకర్తూర్వపనం ప్రశస్తం। తీర్థందృష్ట్వాతతోనిస్నాన వాసాజలమాలిశేత్॥

టీక॥ ఏదినమందు బృహస్పతి, కన్యారాశియందు ప్రవేశించుచున్నాఁడో, యానాడే, క్షవరము. ఉపవాసము చేయవలసినదని కొందఱిమతము. ఇతరదేశస్థులకు, క్షవరము, ఉపవాసము, ముఖ్యముగాని, కృష్ణాతీరమందుండువారికి అవసరములేదు. ఆరుమాసములు

గాని, సంవత్సరముగాని యితర గ్రామములయందుండి, తిరిగి కృష్ణా తీరమందున్న స్వగ్రామమునకు వచ్చిన తీర్థశ్రాద్ధము చేయవలసినది. క్షవరము, ఉపవాసముక్కరలేదు. కృష్ణానదీ రెండుతీరములయందు (అనగా యీవలావలనందు) ఆమడలోపలనున్న గ్రామములన్నియు క్షేత్రములక్రింద లెక్కవేయఁబడినవి. గోదావరి, కృష్ణాపుష్కరములయందు, భార్యాగర్భిణితోనున్న, వివాహాదులు చేసినవారు. మూడుమాసములలోపుననైన, క్షవరముచేయించుకోవలయును, తీర్థము చూడగానే, కట్టుబట్టలతోనదలో స్నానముచేయవలయును.

శ్లో—కన్యారాశి గతేజీవే, కృష్ణవేణీనదీతటే। స్నానందానం! తథాక్షౌరం। త్రికోటికుల ముద్ధరేత్.

టీక—కృష్ణా పుష్కరమందు స్నానము, దానము, శ్రాద్ధము చేయువారు మూడుకోట్ల కులములనుద్ధరింతురు.

శ్లో॥—ప్రాతఃకాలేమహాపుణ్యం। మధ్యాహ్నమధ్యమంఫలం ఆపరాహ్ణే ధమంప్రోక్తం। స్నానం క్షౌరంవ్రతంతథా। పిత్రూనుద్దిశ్య విధివద్ధిరణ్య శ్రాద్ధమాచరేత్, తంతఃకృష్ణ తిలైస్సార్థం పిండదానం ప్రకల్పయేత్.

టీక—స్నానం, క్షౌరము, దానము, వ్రతము ప్రొద్దునచేసిన గొప్పపుణ్యము. మధ్యాహ్నము, మధ్యమఫలము. అపరాహ్ణమునందు, అల్పఫలమువచ్చును. పితృదేవతలనుద్దేశించి హిరణ్యశ్రాద్ధము చేయువలయును. నల్లని నువ్వులతో పిండములు వేయువలయును.

శ్లో॥—దానందద్యాద్బ్రాహ్మణేభ్యో। గోసువర్ణ తిలాదికం। భూమిదానం యథాశక్త్యావస్త్రదానంచ శక్తితః। తులాపురుషదానాని। పిత్రూనుద్దిశ్యకారయేత్, పిండప్రదానకాలేతు, కన్యాదానం సమాచరేత్। పాణిగ్రహణేన కర్తవ్యం। మనస్సంకల్పతస్తథా। ద్వయోఃపుష్కరయోరంతే। పాణిగ్రహణ మిచ్ఛతి। పితౄణాం కర్మకాలేచ షోడశమహాదాన మధ్యోక్త కన్యాదానస్య ముఖ్యపక్షత్వాత్। సంకల్పతః కర్తవ్యం, నతుపాణిగ్రహణాదికం। కన్యారా

శింగతేజీవే। యోధర్మంనసమాచరేత్। అజాగళస్తనస్యేవ। తస్య జన్మ నిరర్థకం.

టీక॥—పితృదేవతలనుద్దేశించి, షోడశమహాదానములు చేయవలయును. కన్యాదానము, మనసాపాత్రను యివ్వదలచినవానినుద్దేశించి సంకల్ప పూర్వకముగా దానముచేసి, పుష్కరవత్సరము దాటిన పిమ్మట కన్యాదానము (అనగా విధివత్తుగా పెండ్లి) చేయవలయును. కృష్ణాపుష్కరమునందు, దానముచేయలేనివానిపుట్టుక, మేక గొంతున వ్రేలాడు స్తనములవలె వ్యర్థము.

పుష్కర స్నాన ఫలము.

శ్లో॥ భాగీరథ్యాం వర్షమేకం। ప్రాతస్స్నానేన, యత్ఫలం। కృష్ణవేణ్యాం జలం స్పృష్ట్వా। లభే తత్కన్యాగతే గురౌ। స్నానేన వర్షజం పుణ్యం। గంగాయమునసంగమే। కృష్ణవేణ్యాం జలంపీత్వా। లభే తత్కన్యాగతేగురౌ। తపసాయత్ఫలం పుణ్యం। నర్మదాయామ్మనుర్యగే। కృష్ణవేణ్యాం సకృత్స్నానాల్లభే తత్కన్యాగతేగురౌ।సకృత్స్నానం కరోత్యస్తు సర్వపాపైః ప్రముచ్యతే। దృష్ట్వా, స్పృష్ట్వా జలం పీత్వా। కన్యాయుక్తే బృహస్పతౌ। నర్మదాయాం తపఃకుర్యాద్వారణాస్యాం తనుంత్యజేత్। దానం దద్యాత్కురుక్షేత్రే। లభేన్ముక్తిపదం త్రయం। త్రివిధం కృష్ణవేణ్యాయాం। అధికం లభతేనరః॥

టీక॥ నిత్యము గంగయందు ప్రాతఃకాలమునందు స్నానముచేసిన నెటువంటిపుణ్యము లభించునో, అటువంటి పుణ్యము పుష్కరదినములలో కృష్ణానదీజలములు తాకినంత మాత్రముననే వచ్చును. గంగా యమునా సంగమమునందు సంవత్సరము స్నానము చేసిన వచ్చు పుణ్యము కృష్ణానదిలో నీరు పుష్కరదినములలో త్రాగినంత పుణ్యము వచ్చును. నర్మదానదీతీరమునందు తపస్సుచేసినకలుగుపుణ్యము. కృష్ణాపుష్కరములో నొక్క దినమున స్నానముచేసినవచ్చును.

పుష్కరములెన్ని? ఏనదికి ఎప్పుడువచ్చును?

శ్లో॥ మేషేచ, గంగా, వృషభేచ నర్మదా। యుగ్మేచవాణీ। యమునా కుళీరె। గోదావరీ సింహగతేచ కన్యాం। గతే దేవగురౌచ కృష్ణా। కావేరి తౌళ్యామళితామ్రపర్ణీ। చాపేచ సింధూ మకరేచ

భద్రా। ఘుటగుణభీమాధీప్రణీతా। మీనేగతే పుష్కర మాహూ రార్యః॥

1 బృహస్పతి మేషరాశికి వచ్చిన గంగాపుష్కరము.
2 బృహస్పతి వృషభ రాసికి వచ్చిన నర్మదా పుష్కరము.
3 బృహస్పతి మిథునరాశికి వచ్చిన సరస్వతీ పుష్కరము.
4 బృహస్పతి కటకరాశికి వచ్చిన యమునా పుష్కరము.
5 బృహస్పతి సింహరాశికి వచ్చిన గోదావరీ పుష్కరము.
6 బృహస్పతి కన్యారాశికి వచ్చిన కృష్ణా పుష్కరము.
7 బృహస్పతి తులారాశియందున్న కావేరీ పుష్కరము.
8 బృహస్పతి వృశ్చికరాశికి వచ్చిన తామ్రపర్ణీ పుష్కరము.
9 బృహస్పతి ధనస్సునకు వచ్చిన సింధూపుష్కరము.
10 బృహస్పతి మకరరాశికి వచ్చిన భద్రా పుష్కరము.
11 బృహస్పతి కుంభరాశికి వచ్చిన భీమరథీ పుష్కరము.
12 బృహస్పతి మీనరాశికి వచ్చిన ప్రణీతాపుష్కరము.

## పుష్కరదినములలో చేయవలసిన దానములు.

## సంకల్పవిధి.

సంకల్పముచేసి ఏవంగుణవిశేషణ విశిష్టాయాంశుభతిథే, కన్యాగతే దేవగురౌసార్ధత్రికోటితీర్థ సహిత పుష్కర ప్రయుక్త, కృష్ణానద్యాం। ప్రథమే మిత్రరూపీ పరమాత్మప్రీతయే స్వర్ణ,రజత, ధాన్య, భూదానాని, కరిష్యే ఆదౌ సువర్ణదానం కరిష్యే॥

టీక॥ బంగారము; వెండి, ధాన్యము, భూమి 4 దానములు. మొదటిదినము బంగారము. స్వర్ణం పవిత్రమమలం స్వర్ణం పాపప్రణాశనం స్వర్ణం హితంకరం యస్మాదతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ యీశ్లోకము చదివిఅస్మైబ్రాహ్మణాయ గోత్రముపేరుచెప్పి యిచ్చేవానిపేరు చెప్పి మహావిష్ణు స్వరూపాయ, శ్రీమహావిష్ణు ప్రీతయే. సువర్ణదానం తుభ్యమహం సంప్రదదేనమమ దానమిచ్చిదక్షిణ యివ్వవలయును. శ్లో॥ అనుభూత్వాసర్వభోగాన్ సూర్యలోక మవాప్నుయాత్॥ బంగారము దానముచేసినవారు సర్వసౌఖ్యము లనుభవించి సూర్యలోకము

చేరును. ప్రతిదానమునకు శ్లోకము చదివి దక్షిణతోకూడ దాన మిచ్చినీళ్ళు విడిచిపెట్టవలయును.

వెండి

శ్లో॥ పితౄణాం వల్లభం యస్మాద్విష్ణోర్వై శంకరస్యచ రజితం పాతుమేనిత్యం। శోకసంసారసాగరాత్॥

వెండిదానమిచ్చిన రాజలోకము చేరును.

3. ధాన్యదానం—శ్లో॥ ధన్యంకరోషిదా తారం। ఇహలోక పరత్రచ। యస్మాత్తస్మాచ్ఛివంమేస్య। దతశ్శాంతిం ప్రియచ్ఛమే॥ ధాన్యదానము చేసినవారు కుబేరునివలె ధనవంతులగుదురు.

4. భూదానం—శ్లో॥ సర్వసస్యాశ్రయాం భూమిం। వరాహేణస ముద్ధృతాం। అనంతసస్య ఫలదాయ మతశ్శాంతిం ప్రియచ్ఛమే॥ భూమిదానము చేసినవాడు రాజుగా జన్మించును.

రెండవ దినమునందు.

ద్వితీయదినే అర్ఘ్యమ్మురూపిణీ, పరమాత్మప్రీతయే। వస్త్రలవణ, గో, రత్న దానానికరిష్యే॥

ఉప్పు,వస్త్రము,ఆవు,రత్నములు, దానములు చేయవలయును.

1. శీతవాతోష్ణ సంత్రాణాం। లజ్జయారక్షణంపరం। దేహాలంకరణం వస్త్రమతశ్శాంతిప్రియచ్ఛమే॥ వస్త్రదాతామయోమర్త్యో వసూనాంలోక మాప్నుయాత్

2. లవణదానం—శ్లో॥ యస్మాదన్నరసాస్సర్వే। ప్రజంతిస్వాదుతాం సదా। లవణంత్వాప్రదాస్యామి। భీతోహం భవసాగరాత్. ఫలం॥ లవణస్య ప్రదాతాదులావణ్యం సమవాప్నుయాత్.

3. గోదానం—శ్లో॥ గవామాగేషుతిష్ఠతి, భువనాని చతుర్దశ। యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా। దతశ్శాంతిం ప్రియచ్ఛమే॥ఫలం॥ గోప్రదాతాతుయో మర్త్యో। గోలోకం విమలాం శ్రియం॥

4. రత్నదానము—శ్లో॥ యస్మాత్సర్వేషు రత్నేషు। దేవాస్సర్వేవసంతిచ। రత్నదానేన మేశాంతిం। సంప్రయచ్ఛంతుమే సదా॥ఫలం॥ రత్నానాంచప్రదాతాతురాజరాజోభవేన్నరః.

## మూడవదినము.

బెల్లము, కూర, గుఱ్ఱము, ఫలము, దానము చేయవలయును.

తృతీయే దినే త్వష్టాత్మక, పరమాత్మ ప్రీతయే, గుడ, శా కాశ్వ ఫలదానాని కరిష్యే॥

1. గుడదానం—శ్లో॥ రసానాముపి సర్వేషాం। శ్రేష్ఠమిక్షు రసంస్కృతం। యస్మాత్తస్మాత్పరాం ప్రీతిం। అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ఫలం॥ గుడప్రదస్తుయో మర్త్యో, కుబేర న్నవమోదతే॥

2. శాకదానం—శ్లో॥ శక్యతేన్నమనేనాత్తుం। తేన శాక ముదాహృతం। దదామి బ్రాహ్మణాయైత చ్ఛాకం శోకవినాశనం। ఫలం॥ శాకదాతానరోయస్తు శక్రేణ సమదాత్రజేత్॥

3. అశ్వదానం—శ్లో॥ అశ్వోహి వాహనం భానోః। శర ణంహి శతక్రతోః। త్వత్ప్రసాదేనమే భూయా ల్లక్ష్మీస్సౌఖ్యం నిరంత రం॥ ఫలం॥ అశ్వదాతాతు యోమర్త్యో హ్యశ్వినో లోకమాప్ను యాత్॥

4. ఫలదానం—శ్లో॥ ఫలం మనోరథఫలం। పుత్రపౌత్ర ప్రవర్ధనం సన్తానసమృద్ధ్యర్థం। అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ఫలం॥ ఫలదాతా నరోయస్తు పురందర పురంవ్రజేత్॥

## నాల్గవదినము.

నెయ్యి, నూనె, తేనె, పాలు దానము చేయవలయు.

1. ఆజ్యదానం—శ్లో॥ కామధేనోస్సముద్భూతం। సర్వ క్రతుషుసంస్థితం। దేవానామాజ్య మాహార మతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ఫలం॥ ఘృతదాతాతుయో మర్త్యో దీర్ఘాయుష్మాభవేద్ధ్రువం॥

2. తైలదానము—శ్లో॥ తిలతైలసముద్భూతం। సర్వారిష్ట నివా రణం। తుష్టిదం బలదం యస్మాదశ్శాంతి ప్రయచ్ఛ మే॥ ఫలం॥ తైల దాతానరోయస్తు నరకం నైవపశ్యతి॥

3. మధురదానం—శ్లో॥ నానాపుష్పరసోద్భూతం। స్త్రీణా ముపి వల్లభం। దానేన మధునస్సమ్యక్। మధుసూదన ప్రీణస్వతు॥ ఫలం॥ దాతాతు మధునోయస్తు। మాధవస్య పురంవ్రజేత్॥

4. క్షీరదానం—ప్రాణినాం జీవనం క్షీరం। పితృదేవ ప్రియంసదా। శ్శాంతిదం పుష్టిదం యస్మా దతశ్శాంతి ప్రయచ్ఛమే॥ ఫలం॥ క్షీరదాన వరోయస్తు లక్ష్మీశ్రీ భ్యాం సమన్వితః॥

అయిదవ దినము.

ధాన్యపు బండి, దున్నపోతు (లేక గేదె) ఎద్దు, నాగలి, దానములు చేయవలయు.

5. పంచమదినే, వివస్వద్రూపీ, పరమాత్మ ప్రీత్యే, ధాన్య శకట, మహిషీ వృషభహాలదానానికరిష్యే.

1. ధాన్యశకటదానం-వాహయోగ్యం రథంభుక్తిముక్తి ప్రదమభీష్టదం। దదామి ధాన్యసంపూర్ణ మహంవిష్ణోసుతుష్టయే॥ ఫలం॥ సంపూర్ణధాన్య శకటం దత్వాస్వర్గేసుఖీ భవేత్॥

2. మహిషదానం—॥శ్లో॥ యమవాహీచగుహిషి। మృత్యురూపేణసంస్థితా। సర్వవ్యాధిహరానిత్య మతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ఫలం॥ మహిషీం చప్రదాతాతు గంధర్వాధి పతిర్భవేత్॥

3. వృషభదానం—శ్లో॥ వృషభోధర్మ ఏవస్యా న్మహాదేవ ప్రియస్సదా। ప్రదానే నాస్యపాపానాం। శాంతిరస్తు సదామమ॥ ఫలం॥ వృషభస్య ప్రదాతాతు కైలాసే సుఖమాప్నుయాత్॥

4. హాలదానం—యుగరజ్జ సమాయుక్తం। లాంగలంజీవనం స్మృతం। బలరామయుతం యస్మాత్ప్రయచ్ఛామి ద్విజాత్యే॥ఫలం॥ హాలదాతాతు మోక్షార్థ్యో యీశ్వరస్య ప్రియోభవేత్॥

ఆరవ దినమునందు.

ఔషధము,కర్పూరము, కస్తూరి, మంచిగంధము, దానములివ్వవలెను.

షష్ఠే ఆరుణరూపే, పరమాత్మ, ప్రీత్యే, ఔషధ, కర్పూర కస్తూరీ హరిచంద దానానికరిష్యే॥

1. ఔషధదానం—ప్రాణినాం జీవనోపాయం।సామేనోత్పాది తాపురా। ఔషధంత్వాం ప్రదాస్యామి. తేనాహంస్యాన్నిరామయః॥ఫలం॥ ఔషధం రోగిణేదద్యాదారోగ్యంలభతేనరః॥

2. కర్పూరదానం—కర్పూరం రుచిరం విప్రగృహాణేమం సుగంధద్రవ్యగంధకం మేస్యాలక్ష్మీ సంప్రియతాంసదా॥ఫలం॥

కర్పూరస్యప్రదాతాతు, కమలాయాః పురం వ్రజేత్॥

3. కస్తూరీదానం—కస్తూరీ భాగ్యదోభవ్యా। దేవమర్త్య ప్రియంసదా। దానేనసుఖదం భాగ్యం శాంతిశ్చాస్తుసదామమ॥ఫలం॥ కస్తూరీ ప్రదదోయస్య, గంధర్వంలోకమాప్నుయాత్॥

4. చందనదానం—గంధంమృష్టంమృదుసదా। తాపఘ్నం హర్షవర్ధనం।సర్వదేవప్రియంయస్మా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥ఫలం॥ చందనస్యప్రదాతాను. చంద్రేణ సహమోదతే॥

ఏడవదినమునందు.

ఇల్లు, పీట, పరుపు, పల్లకీలు దానము చేయవలయును.

సప్తమేదినే భగరూపీ, పరమాత్మ ప్రీతయే, గృహ పీఠ శయ్యాందోళికా దానాని కరిష్యే॥

1 గృహదానం—శ్లో॥ దేవాదీనాం నివాసంత్వం। ప్రాణి నాం శరణం తథా తదామే శ్రీమవిశాంతై్యే। గృహం సోపస్కరం భవ॥ ఫలం॥ గృహదాతు యోమర్త్యో దీర్ఘాయుర్జాయతే। ధృవం॥ గృహదానము చేయునపుడు యింటిముందర దానముచేయవలయును. అలంకరించిన యింట్లో ప్రవేశపెట్టవలయును. శ్లో॥ సోపస్కరం గృహం ప్రవేశయేత్। దేహళీ సమీపే దానం కుర్యాత్॥

2 పీఠదానం—శ్లో॥ విష్టరం బ్రహ్మదైవత్యం। యోగసా ధన ముత్తమం। పీఠం త్వాహం ప్రదాస్యామి సుఖమస్తు సదామమ॥ ఫలం॥ పీఠ దానేన లభతే సింహాసన పదంవరం॥

3 శయ్యాదానం—శ్లో॥ రాస్మాద శూన్యం శయనం। కేశ వస్య శివస్యచ। తథా మమాప్యశూన్యం స్యాచ్ఛయనం జన్మజన్మని॥ ఫలం॥ శయ్యామాందోళికాదాతా సర్వాన్కామానవాప్నుయాత్॥ శ్వేతకంబళపరిధానం శయ్యాం దద్యాత్॥ తెల్లని కంబళి దుప్పటి పరచి శయ్యాదానము చేయవలయు.

4 ఆందోళికాదానం—శ్లో॥ వాహనా మతిశ్రేష్ఠాంతు। నృ వాహ్యాం వస్త్రవేష్టితం। ఆందోళికాం ప్రదాస్యామి। ఆరోహత్వం ద్విజోత్తమ। పింఛదేశేదానం సధూళిపింఛం గ్రాహయేత్॥

## ఎనిమిదవ దినమునందు.

గంధపుచక్క, పుష్పాలు, దుంపలు, అల్లము దానము చేయవలయును.

1 అష్టమదినే అంశుమద్రూపీ । పరమాత్మ ప్రీతియే । గంధదారు, పుష్ప, మూల, ఆర్ద్రిక దానాని కరిష్యే॥

గంధదారుదానం—మలయాద్రి సముద్భూతం। సర్వభూరుహ నాయకం గంధదారు ప్రదాస్యామి । విష్ణు ప్రీతికరంశుభం ॥ఫలం॥ గంధప్రదాతా యో మర్త్యో । లోకం గాంధర్వ మశ్నుతే॥

1 పుష్పదానం—శ్లో॥ మనోహరాణి పుష్పాణి । సర్వదేవ ప్రియానిచ । అతస్తేషాం ప్రదానేన సౌమనస్యం భవేన్మమ ॥ఫలం॥ పుష్పాణాంతు ప్రదానేన శక్రేణ సహమోదతే॥

3 మూలదానం—శ్లో॥ మూలం మునినామాహారం। దుర్భిక్షే జీవనప్రదం। అతస్తాని ప్రదాస్యామి మూలాని ద్విజసత్తమ॥ ఫలం॥ మూలానాంతు ప్రదానేన, విష్ణునా సహమోదతే॥

4. ఆర్ద్రికదానము—ఆర్ద్రికం సర్వరోగాణాం । మహౌషధ రుచివర్ధనం । తస్యదానేన, మేనిత్యం, ఆరోగ్యం సుఖవర్ధనం॥ ఫలం॥ ఆర్ద్రికం యో నరోదద్యాద్గాంధర్వం లోకమాప్నుయాత్॥

## తొమ్మిదవ దినమందు.

శ్రాద్ధము, పిండదానము, దాసీదానము, కన్యాదానము, చేయవలయును.

నవమేదినే, ఇంద్రరూపీ। పరమాత్మ ప్రీత్యర్థం । శ్రాద్ధ పిండ దాన, దాసీదాన కన్యాదానని కరిష్యే॥

1. శ్రాద్ధము—శ్రాద్ధము మూడు విధములు. హిరణ్యశ్రాద్ధము. (అనగా డబ్బు సర్వపదార్థముల క్రిందపెట్టి శ్రాద్ధము చేయుట.) అయనశ్రాద్ధాదులవలె ఆమశ్రాద్ధము (అనగా బియ్యము పప్పు మొదలగునవి యిచ్చుట) అన్న శ్రాద్ధము. పుష్కరాదుల యందు హిరణ్య శ్రాద్ధము చేయవచ్చును అన్న శ్రాద్ధముచేసినతప్పు లేదు. బ్రాహ్మణుడు మాత్రమే అన్న శ్రాద్ధమున కధికారి. నదీతీర

ములయందు బ్రాహ్మణులుకూడ, హిరణ్య శ్రాద్ధముచేయవలయునని శాస్త్రము, దేశాచారముకూడఁ గలదు. దీనికి ప్రమాణములు కలవు. గ్రంథవిస్తర భీతిచే వ్రాయులేదు. ఫలం॥ శ్రాద్ధం కృత్వాతు ధర్మాత్మా। సంతానం లభతే నరః॥

2. పిండదానము—యవపిండి, గోధుమ, బియ్యపుపిండి, దేనిలోగాని నవ్వులుగాని, నువ్వులపిండిగాని కలిపి, రేగుపండ్లవలెఁ జేసి పిండములు వేయవలయు. పిండములువేయు క్రమము చరిత్రరూపముగా నిందు చూపఁబడినది. యావచ్ఛక్తిగాఁ పిండములు వేయవలయును.

2 దాసీదానం—శ్లో॥ క్షీరోదార్ణవ సంభూతా। లక్ష్మీర్దాసీసముద్భవ। తథాసంసార తరణే। భవమేత్వం నహాయినీ॥ శిరోభాగే దాసీదానం చేయవలయును. మూల్యంవాదాసీంవా దద్యాత్॥ దాసీని యివ్వవలయును. లేక ప్రతినిధి డబ్బు నివ్వవలయును॥ ఫలం॥ దాసీం శయ్యాంచయో దద్యాత్స్వర్గలోకే సుఖీభవేత్॥

4. కన్యాదానం—త్వంగౌరీ శంకరాయాస్మైవరాయ వినివేదితా। దేవసంతతి వృద్ధ్యర్థం కన్యేవాంఛిత మస్తుమే॥ఫలం॥ సుహూపాయ, సుశీలాయ శ్రోత్రియస్యాత్మ జాయచ। కన్యాం దద్యాచ్ఛుభాంల్లోకాన్, లభతే నాత్ర సంశయః॥

పదియవ దినమునందు.

హరిహరపూజ లక్ష్మీపూజా, నదీపూజా, గౌరీపూజ, చేయవలయు. కూర, సాలగ్రామ, పుస్తకదానములు చేయవలయును.

దశమదినే, పర్జన్యాత్మక, పరమాత్మప్రీత్యర్థే హరిహరపూజా లక్ష్మీగౌరీ, నదీపూజా చకార్యా, శాక, సాలగ్రామ, పుస్తకదానాని కరిష్యే

1. లక్ష్మి,గౌరీ, నదీ ప్రతిమలు చేయించి వానిని పూజించి బ్రాహ్మణునకు పూజా ప్రతిమను దాన మీయవలయు.

2. శాకదానం—శ్లో॥ శక్యతేన్నమనేనాత్తుం। తేనశాకముదాహృతం। దదామి బ్రాహ్మణాయైతచ్ఛాకం శోకవినాశనం॥ ఫలం॥ శాకదానరోయన్ను। శకేణ సమతాం లభేత్॥

3. సాలగ్రామదానం—శ్లో॥ సాలగ్రామ శిలాచక్రే। భువనానిచతుర్దశ। యస్మాత్తస్మాచ్ఛివం మేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ ఫలం॥ సాలగ్రాము శిలాదానం యోదద్యాదు త్తమోత్తమః। భూచక్రం తేనదత్తం స్యాత్స శైలవనకాననం॥

టీక—సాలగ్రామము దానము చేసిన అరణ్యములతోను వనములతోను భూచక్రమంతయు దానమిచ్చిన ఫలముకువచ్చును.

4. పుస్తకదానం—శ్లో॥ బ్రహ్మవక్త్రస్థితాదేవి। నృతిరూపీ మహేశ్వరీ। మద్వాచి సర్వదానాత్యం। కురుషద్మాసన స్థితా॥ ఫలం॥ పుష్కరే పుస్తకందానం। అన్నదానం కరోతియః। సర్వదాసుఖమాప్నోతి। పరత్రేహ చ మానవః॥

పదకొండవ దినమునందు.

ఏనుగ, అశ్వము, దాసి, సర్వదానములు చేయవలయును.

ఏకాదశదినే, విష్ణురూపీ పరమాత్మాన ముద్దిశ్యగజాశ్వాది సర్వదానాని కరిష్యే॥ ఫలం॥ గజాశ్వ రథదానంచ। దాసీదానం విశేషతః। దానం కృత్వాతు ధర్మాత్మా। రాజరాజో భవిష్యతి॥

పండ్రెండవ దినమునందు.

తిలలు, షోడశమహాదానములు చేయువలయును. మేకదానం చేయవలయు.

1. తిలదానఫలం—శ్లో॥ ద్వాదశదినే పరమాత్మ ప్రీతయే। తిలాజాది షోడశమహాదానానికరిష్యే॥

శ్లో॥ తిలదానేన సర్వాపద్విని వారయతిధ్రువం॥

2. అజాదానము. ఫలం శ్లో॥ అజాదానం క్రమాద్దత్వాప్లా సీభవతినిశ్చయం॥

షోడశమహాదానములు.

శ్లో॥—గావ-సువర్ణ, మహిహీరత్నానిచ, సరస్వతీ। కన్యా, పత్నీ, హయోనాగో, దాసీ, తౌల్యం, గృహం, మధు, అజా-శయ్యాచ, శకటం, మహాదానాని షోడశ, (గ్రంథాంతరమందు) అనగా యింకొకరి మతము. గావ-సువర్ణ - రజితం-రత్నానిచ, సరస్వతి।

తిలాపి, కన్యా, గజోశ్వశ్చ శయ్యావస్త్రం తథాభువం । ధాన్యం-శకట, సుచ్ఛత్రం, గృహంసోపస్కరంతథా।ఏ తాన్యాహుర్మహా దేవి, మహాదానానిషోడశ॥

టీక—ఆవు, బంగారము, గేదె,రత్నములు, పుస్తకము, పత్తి గుఱ్ఱము, ఏనుగు, దాసీ, త్రాచు, యిల్లు, తేనె, మేక, పక్క, బండి కన్యాదానం. ఇవి 16 మహాదానములు.

## పుష్కర దానఫలములు.

శ్లో॥—మిత్రాది పూష్యపర్యంతాం పూర్వానుద్దిన భూతలే। ప్రత్యహం యోనరః కుర్యాత్స్నానదానాదికంచయత్ । తత్సర్వమహమశ్నామి రవిమండల మధ్యగః॥

టీక॥—మిత్రుడు మొదలు పూషునివరకు ద్వాదశనామ ప్రీతిగ పండ్రెండు దినములు దానములిచ్చిన సూర్యమండలమందు శ్రీ మహావిష్ణువయుండి సంతోషించి మనకు మహాఫలములనొసంగును. మోక్షము చేకూరును.

## పిండ ప్రదానవిధి సంకల్పము.

ఆచమానముచేసి, ప్రాణా నాయమ్య, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, పుణ్యతిథౌ, సార్ధత్రికోటి తీర్థప్రయుక్త పుష్కరసహిత కృష్ణానద్యాం, తీర్థశ్రాద్ధేషు,తిలోదక, పిండప్రదానానికరిష్యే.శుభ్రమైన ప్రదేశమందు ఆవుపేడతో నలికి, కొసలుదక్షిణముగానుండునట్లు దర్భలువరచి, వానిపై తిలోదకములుంచి, చెప్పినరీతిగా పిండములుంచవలయును. తీర్థశ్రాద్ధములయందు, పుణ్యకాలములయందు చేయు శ్రాద్ధములయందు. యీదిగువనుదహరించిన వారిక పిండములుంచవలయును.

శ్లో॥—ఆదౌ, పితా, తదామాతా సాపత్నీ, జననీ, తథా।
మాతామహాస్సపత్నీకాః ఆత్మపత్నీస్త్వనంతరం।

శ్లో॥—సుతభ్రాతృపితృవ్యాశ్చ । మాతులాస్సహాభార్యకాః।
దుహితాభగినీచైవ । దౌహిత్రోభాగినేయకః॥

శ్లో॥—పితృష్వసామాతృష్వసా । జామాతాభావుకస్స్నుషాః।

శ్వశురస్స్యాలకశ్చైవ స్వామినోగురుదక్షిణః॥

1 పితా. 2. పితామహుఁడు. 3. ప్రపితామహుడు,

4. మాతా. సాపత్నీచూ (అనగా) సవతితల్లి. 5. పితామహీ
6. ప్రపితామహీ.

7. మాతామహః=తల్లితండ్రి.

8. మాతుః పితామహః=తల్లి తాత

9. మాతుః ప్రపితామహః=తల్లి ముత్తాత,

10 మాతామహీ=తల్లి తల్లి.

11 మాతుఃపితామహీ=తల్లి నాయనమ్మ

12 మాతుః ప్రపితామహీ=తల్లి నాయనమ్మ అత్తగారు

13 ఆత్మపత్నీ=తన భార్య

14 సుతః=కుమారుడు

15 భ్రాతా=అన్నదమ్ములు

16 పితృవ్యః=పిన తండ్రి పెద తండ్రి

17 మాతులః=మేనమామలు

18 దుహితా=కూతురు

19 భగినీ=అప్పచెల్లెండ్రు

20 దౌహిత్రః=కూతురు కొడుకు

21 భాగినేయకః=మేనల్లుఁడు

22 పితృష్వసా=తండ్రి యప్పచెల్లెండ్రు-(అనగా) మేనత్తలు

23 మాతృష్వసా=తల్లి అప్పచెల్లెండ్రు=(అనగా) పినతల్లి, పెదతల్లి

24 జామాతా=అల్లుఁడు

25 భావుకః=భావమఱది (అనగా) తోడబుట్టినదాని మగఁడు

26 స్నుషా-కోడలు

27 శ్వశురః=మామగారు

28 స్యాలకః-మేనమామ కొడుకులు - భార్య అన్నదమ్ములు

29 స్వామిన ప్రభువులు

30 గురవః - గురువులు
31 రిక్థినః - సొమ్ము యిచ్చినవారు

ప్రతిపిండమునకు ౧ అంగుళమువ్యవధాన ముండవలయు పిండలము ఒకటి కొకటి తాకకూడదు.

## ధర్మ పిండ శ్లోకములు.

విద్యుద్భిర్దం ష్ట్రిభిశ్చైవ । విషనాదివాగ్నిభిః । శస్త్రాస్త్ర దండపాషాణై । ర్నఖభిశృంగి భిర్గ్రహైః । ఉన్మా పస్మారలూతాదిభ గంధరజనోదరైః । గండమాలాదిభిః పాండుకుష్ఠావ్యాధిభిరర్దితాః । చండాలాద్యైస్సహాతాశ్చాస్మిన్ ఆశౌచేశయనేమృతాః । బ్రహ్మస్వహారిణాయేచ । సురాపస్వర్ణహారిణః । గురుదారరతామూఢాః । పరదార, రతాశ్చయే । బ్రహ్మఘ్నాణ వధోపేతాయేఽపిచాత్మహనోజనాః । కుబ్జాశ్చమూకాబధిరాః పితృమాతృకులోద్భవాః । జాతమూవంశసముద్భూతాః । బాలవృద్ధాశ్చ సూతికాః యువానోగర్భ సంస్థాశ్చ, మిత్రాణి సుహృదస్తథా । తిర్యగ్యోనిషు సంభూతాః । ఇహచాన్యత్రజన్మని । తేషాంపిండో మయాదత్తోహ్యక్షయ్యముపతిష్ఠతు. ఇత్యేకః పిండః భూతలే పరిపక్షిపేత్ ॥ యీ శ్లోకములు చదివి. దర్భలమీద నొక పిండము వేయవలయును.

శ్లో॥ పితృవంశేమృతాయేచ । మాతృవంశే తథైవచ । గురుశ్వశురబంధూనాం । యేచాన్యే గతివర్జితాః । తేషాం పిండో మయాదత్తోహ్యక్షయ్యము ప్రతిష్ఠతు. అని రెండవపిండము వేయవలయును.

శ్లో॥ ఆబ్రాహ్మణోయే పితృవంశజాతాః మాతుస్తథావంశభవాః మదీయాః॥ వంశద్వయేస్మిన్ముదాసభూతాః । భృత్యాస్తథైవాశ్రితసేవరాశ్చ । మిత్రాణిసఖ్యః పశవశ్చనానాః । స్పృష్టాశ్చ దృష్టాశ్చ కృతోపకారాః । జన్మాంతరే యేమమసంగతాశ్చ । తేభ్యస్స్వధాపిండమహందదామి. అని మూడవపిండము వేయవలయును.

## పిండములు పెట్టవలసిన వరుస తెలిపె చక్రము.

దక్షిణము

పూర్వము

౩౧ ౪,౪, సవతితల్లులుండిన

౩౦ ౨౨,౨౨ మేనత్తలు

౨౯, ౨౮ ౨౩,౨౩ పినతల్లులు

౨౭,౨౬,౨౬+౨౨,౨౨,+౨౩,౨౩+

౨౫,౨౧,౨౧,౧౯

౨౪,౧౬,౨౦,౨౦+

౯ ౧౨, ౩ ౧౮--౮

౬,౧౭,౧౭+౧౧, ౨,౧౫,౫

౭ ౧౦,౧,౧౪,౪,౪,+14-కొడుకు-

,౧౩ భార్యపిండము.

పశ్చిమము

+ గుర్తు ఆవరుసలో నన్నదమ్ములు, అప్పచెల్లెలు దెలుపును. ఉదాహరణ-౨౩. పినతల్లి,౨౩. ఇంకొక పినతల్లియున్న+ చిట్టచివర ఆమె అని తెలియవలయును.

1 పితా. పితామహా. మొదలు 31 రిక్థినః. వరకు నిందులో వరుస తెలిపియున్నది.

ఉత్తరము

## కృష్ణానదీ పూజా.

ఆచమ్య ప్రాణానాయమ్య ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ, సార్ధ త్రికోటితీర్థం సహిత పుష్కరతీర్థ మహాపర్వణి, సమస్త పాపక్షయార్థం, జ్ఞానాజ్ఞాన సమస్తసముద్దోష పరిహారార్థం కృష్ణవేణీనదీపూజాంకరిష్యే॥ అని సమస్కరించి కలశపూజ చేయవలయును.

కలశమునకు కుంకుమగాని, గంధముగాని మూడు దిక్కుల బొట్లుపెట్టి, పుష్పములు వేసి చెయ్యి మూసిపెట్టి శ్లో॥ కలశస్యముఖే విష్ణుకంఠే రుద్రసమాశ్రితాః। మూలేతత్రస్థితో బ్రహ్మామధ్యే మాతృగణాస్మృతాః। కుక్షేతుసాగరా స్సర్వేకలశాం బుసమాశ్రితాః॥ అని చదివి ఆ యుదకమునకు నమస్కరించి కలశములోని నీళ్ళు పూజాద్రవ్యములమీఁద చల్లవలయు. దేవతమీద చల్లవలయు. తననెత్తిమీద చల్లుకొనవలయును. కృష్ణానదీ ప్రతిమకు ప్రాణప్రతిష్ఠచేసి నమస్కరించవలయును. తరువాత నదిని ధ్యానము చేయువలయును. అక్షతలు, పుష్పములు చేతపట్టుకొని స్థిరమైన బుద్ధితో శ్లో॥ పద్మాస్యాం పద్మవక్త్రాక్షీం। పద్మ గర్భస్వరూపిణీం। చింతయే త్పద్మపాదాబ్జాం పద్మాసన నివాసినీం। సహ్యాజేతే నమస్తుభ్యం। మహాదేవస్య వల్లభే। త్వద్భక్తి మనిశం దేవి। దేహి కృష్ణామహానదీ ఇతిధ్యాత్వా। కృష్ణవేణీనదీ దేవతాయైనమః। ధ్యానం సమర్పయామి॥ అని పువ్వులు, అక్షతలు విగ్రహముమీఁద వేయవలయును.

శ్లో॥ ఆవాహయామి దేవేశం। సర్వాభీష్టప్రదాయినీం। సర్వ పాపహరాం దేవం। మహాదేవ ప్రియాంశివాం॥ కృష్ణానదీ దేవతాయైనమః ఆవాహనం సమర్పయామి॥ పువ్వులు అక్షతలు వేయవలయును.

శ్లో॥ స్వర్ణరత్న సమాయుక్తం। దివ్యరత్నైవ శోభితం। దివ్య సింహాసనం కృష్ణే। దాస్యామి ప్రతిగృహ్యతాం॥ కృష్ణవేణీ దేవతాయైనమః। నవరత్నం ఖచితసింహాసనం సమర్పయామి॥ అని పుష్పములు, అక్షతలు వేయవలయును.

శ్లో॥ కృష్ణే కృష్ణాంగ సంభూతే। దేవాసుర నమస్కృతే। విష్ణుప్రియే మయాదత్తం గృహాణార్ఘ్యం నమోస్తుతే। కృష్ణానదీ దేవతాయైనమః। అర్ఘ్యం సమర్పయామి॥ ఉద్ధరిణతో నీళ్లు చల్లవలయును.

శ్లో॥ చంద్రచూడ ప్రియే దేవి। భక్తాభీష్ట ప్రదాయినీ। సంగృహాణ శుభేశ్యామే। పాద్యమే తన్మయార్పితం।కృష్ణవేణీదేవతాయైనమః। పాద్యం సమర్పయామి॥అనిఉద్ధరిణతోనీళ్ళు వేయవలయును.

శ్లో॥ మృగనాభి సమాయుక్తం । కర్పూరాద్యైస్సువాసితం । పానీయంచ మయాదత్తం । సమ్యగాచ మనీయకం । కృష్ణవేణీ దేవతాయైనమః । ఆచమనీయం సమర్పయామి॥ ఉద్ధరిణతో నీళ్ళు పోయవలయును.

శ్లో॥ క్షీరాజ్యేక్షురసైః పుష్పైర్దధ్నాచ మధునా ఘా । పంచామృతైస్స్నాపయిష్యే । కృష్ణవేణీ నమోస్తుతే॥ కృష్ణవేణీ దేవతాయై నమః । పంచామృతస్నానం సమర్పయామి॥ పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార, చెరుకురసము మొదలగునవి చల్లవలయును.

శ్లో॥ ఉశీరగంధ సంయుక్తం । సర్వౌషధి సమన్వితం । మయాహృతం జలంకృష్ణే । స్నానంకురు శివప్రియే ॥ కృష్ణవేణీ దేవతాయై నమః । శుద్ధోదకస్నానం సమర్పయామి॥ తమలపాకుతోగాని పుష్పముతోగాని స్నానము చేయించవలయును.

శ్లో॥ సర్వలక్షణ సంపన్నే । దీనోద్ధరణ శాలిని । కౌశేయ వస్త్రయుగ్మంచ । శుభేతే ప్రదదామ్యహం॥ కృష్ణవేణీ దేవతాయైనమః । వస్త్రయుగ్మం సమర్పయామి॥ అని వస్త్రము లియ్యవలయును.

శ్లో॥ కంచుకం కాంచనందివ్యం । విధాత్రా నిర్మితం పురా । అహందాస్యామిదేవే । కృష్ణాభీష్ట ప్రదాయినీ । కృష్ణవేణీ దేవతాయై నమః । కంచుకాభరణాది సమర్పయామి॥ అని అక్షతలు దూదితో చేసిన వత్తిముత్తియని వాడుకగల యజ్ఞోపవీతము రెవికె తాంబూల మీయవలయును.

శ్లో॥ స్వచ్ఛం నిర్మలమత్యర్థం । పురతిస్వీకృతం శుభం । కంఠసూత్రం గృహాణత్వం । దదామ్యాభరణానిచ॥ కృష్ణవేణీ దేవతాయైనమః । నానాభరణార్థ మక్షతాన్ సమర్పయామి॥

శ్లో॥ చందనాగరుకర్పూర । మృగనాభిసమన్వితం । గంధం గృహాణ దేవేశి । దేవదేవాంగభూషణే॥ కృష్ణా దేవతాయైనమః । శ్రీగంధం సమర్పయామి॥ గంధము సమర్పించవలయును.

శ్లో॥ శాలీయాం శ్చంద్ర వర్ణాంశ్చ।హరిద్రామిశ్రితాన్ శుభాన్ అక్షతాంశ్చార్చ హేతుభ్యం । గృహాణ శ్రీహరిప్రియే॥ కృష్ణానదీ దేవ

తాయైనమః । కుంకుమాక్షతాన్ సమర్పయామి॥ అని అక్షతలు వేయ వలయును.

శ్లో॥ కరవీరై ర్జాజి కుసుమైశ్చంపకై ర్వకుళై శ్శుభైః । శతపత్రై శ్చకలాహారై రర్చయే త్వాం హరిప్రియే॥ మయాహృత మిదం పుష్పం తులసీదళసం యుతం । మాల్యంగృహాణ దేవేశి । కృష్ణవేణీ నమోఽస్తుతే॥ అని పుష్పము సమర్పించి పుష్పములతో పూజింపవలయును.

1. కృష్ణాయైనమః। 2. కృష్ణవేణ్యైనమః। కృష్ణాంగ సంభూతాయైనమః। 4. కృత్తివాసజటాజూటవిహారిణ్యైనమోనమః। 5. కృష్ణాభీష్టప్రదాయైనమః। 6. కృపార్ద్రాం భూతహృత్కమలాయైనమః। 7. కృష్ణపాదసముద్భవాయైనమః। 8. కృచ్ఛ్రనాశిన్యైనమః। 9. కృపీవలామోదదాయిన్యైనమః। 10. కృష్ణస్వరసనోహరాయైనమః। 11. కృపామోదకారిణ్యైనమః। 12. కృతకల్మషనాశిన్యైనమః। 13. కృతార్ద్రీభూతసకలాసురాయైనమః। 14. కృపాకటాక్షవీక్షణాయైనమః। 15. కృత్రిమధ్వంసశీలాయైనమః। 16. కృత్తివాసప్రియాయైనమః। నానావిధపరిమళపుష్పాణి సమర్పయామి॥ పుష్పముల పూజచేయవలయును.

శ్లో॥ చందనాగరుకర్పూర । ఘృతగుగ్గుల సంయుతం । గృహాణధూపం వందే । కృష్ణవేణీ నమోస్తుతే ॥ కృష్ణానదీ దేవతాయైనమః॥ ధూపమాఘ్రాపయామి । ధూపమీయవలయును సాంబ్రాణి వేయవలయును.

శ్లో॥ ఘృతవర్తిషు దీపంతే । మయార్పిత మిదంశుభం । గృహాణమంగళం దీపం । సర్వైశ్వర్య ప్రదాయినీ॥ దీపం సమర్పయామి దీపము వెలిగించి చూపింపవలయును. ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి

శ్లో॥ క్షీరంచగుడ సంయుక్తం సర్పిషాయుతమాదరాత్ ।మయానివేదితం భుంక్ష్వ । పంచభక్ష్యసమన్వితం । కృష్ణానదీ దేవతాయైనమః । అమృతనైవేద్యం సమర్పయామి నైవేద్యము పెట్టవలయును.

శ్లో॥ పూగీఫలైశ్చ కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ! తాంబూలం గృహాణ్వతాం దేవి శరణాగత వత్సలే॥ తాంబూలం సమర్పయామి, తాంబూలమీయవలయును,

శ్లో॥ వ్రతపూర్తిం మహాకీర్తిం దివ్యస్ఫూర్తిం హరిప్రియే। సహ్యజే కృష్ణవేణీత్వం। కురుమే దేవి వత్సరే॥ కృష్ణా దేవతాయైనమః॥ పుష్పం సమర్పయామి పుష్పములు చల్లవలయును.

శ్లో॥ స్వర్ణపాత్రస్థితం దేవి। కర్పూరేణసమన్వితం। నీరాజనం మయాదత్తం। గృహాణపరమేశ్వరి। కృష్ణానదీదేవతాయైనమః। నీరాజనం సమర్పయామి। కర్పూరము వెలిగించి చూపింపవలయును.

శ్లో॥ సువర్ణ మంత్రపుష్పంచ। కుంకుంభక్త్యాసమర్పితం। నానారత్నసమాయుక్తం। సహ్యజేత్వం గృహాణమే॥ కృష్ణవేణీదేవతాయైనమః! సువర్ణమంత్రపుష్పం సమర్పయామి॥ పుష్పాక్షతలు సమర్పించవలయును.

శ్లో॥ పాపోహం పాపకర్మాహం। తస్మాత్త్వం వ్యపోహయ। త్రాహిమాం కృపయాదేవి। ప్రదక్షిణకృతంనమః॥ కృష్ణానదీ దేవతాయైనమః ప్రదక్షిణనమస్కారం సమర్పయామి। ప్రదక్షిణముచేసి నమస్కరించవలయును.

ఛత్రం సమర్పయామి। చామరయుగళం సమర్పయామి। నృత్యం సమర్పయామి। గీతంశ్రావయామి। ఆదర్శదర్శయామి। సర్వోపచారాన్సమర్పయామి॥ అక్షతలు వేయవలయును.

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు। న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవదే తనసహ్యజాం। అని, అక్షతలునీళ్ళు విడువవలయును.

శ్లో॥ మహేశ్వర జటాజూట నాగవల్లీ దళాకృతీ।
సహ్యపర్వత సంచారీ ప్రసీద పరమేశ్వరి॥

మజ్జనాంగ సంస్పర్శనిమిత్తము వినాంగతాం। గంగాం శివాం ప్రకుర్వానే॥ ప్రసీద పరమేశ్వరీ॥ పూజచేసినప్రసాదముతీసికొనవలయును. కృష్ణాపూజ సంపూర్ణము.

మొదటికథ భూదానమహిమ

భీష్ముండు చతుర్ముఖునకు నమస్కరించి మహాత్మా పుష్కరదినమున చేయు దానములలో ప్రథమదివసమున జేయుదానముల వల్ల

ధిరాజులు కూడ వానిమాయలోఁబడి వానికి పాదాక్రాంతులై వాని శాసనము శిరసానహించి నడుచుచుండువారు ఇట్లు వాఁడు లోకకంటకుఁడై జీవితమును గడుపుచు యేబదియేండ్లుజీవించి యొక చండాలవనితకై మాలగూడెముచేరఁగా నా పంచములందరు వీనిబాధపడజాలక గుమిగూడి యొకయింట మాఁటువడుచు మదనమహారాజ మహోత్సవమనుభవించు నవసరమున నా గుడిసెకు నిప్పుపెట్టి సజీవులుగా నా కరణముగారిని వలపుకత్తెతో సహాపరలోకమునకంపిరి. ఈ వార్తవిని సమీపగ్రామవాసులందరు మాలవారికి నమస్కరించి యిలవేల్పులవలెఁ బూజించిపోయిరి. ఈవార్త రామనగరము చేరిన తోడనే కొందరాకరణముగారి యింటికిఁబోయి పూర్వపువిరోధము దీర్చుకొన ప్రయత్నముచేసిరిగాని యాతనికుమారుడు పసివాఁడు. ఆతని తల్లి కరణముగారి భార్య కడుసాధ్వి భర్తచేయు దుండగము ఆమెకుయిష్టము లేకపోయినను పెనిమిటి మాటకు భిన్నముసేయకుండ కాలము గడిపినది. పతిమరణదుఃఖ మొకమూలకుఁ దిగ ద్రోచికొని తన యింటిమీదివచ్చిన దండును బ్రతిమాలి యావలకు బంపుటకు సహాయముగా నొక గృహస్థుని బ్రతిమాలి సమస్తవ్యవహారములు వానివలన నెరవేర్పించుకొనుచు తనమాట మంచితనముచే సుఖముగాఁ గాలము గడుపుచుండెను. మన కరణముగారు మాలగూడెములో మాడి మసికాగానే యమదూతలు వానిని యమలోకమున కీడ్చుకొనిపోయి యథాశాస్త్రీయముగా యమలోకములోగల నరక బాధలననుభవింపఁజేయు చుండిరి. వానికుమారునకు యుక్తవయస్సు వచ్చినది. విద్యావంతుఁడైనాఁడు. పదుగురులో, పేరుప్రతిష్ఠలు సంపాదించుచు తనకు చిన్నతనము నుండి తోడు నీడగా నున్న బ్రాహ్మణునకు గారణాంతరమున తనతండ్రియపహరించిన భూమిని నెపముగా దానమిచ్చినట్లు వ్రాయవలసివచ్చినందున, నట్లువ్రాసి తరువాత నాభూమిని మరల క్రయరూపముగాఁ బుచ్చుకొనదలఁచి ప్రకృతము పదిమందికి వెల్లడియగునట్లు సంకల్పరూపముగా పితృదేవతల నుద్దేశించి భూదానము చేసిన దానపత్రము రాగిరేకుమీద వ్రాసి కపటదానముచేసి, యప్పటివ్యవహారపు దిక్కునుండి

నంగలుగు ఫలములను వినియున్నాను. యీదానములవలన తరించిన వారలుగలరా? అత్రిమహాసీయుల చరిత్రయొక్కటి నాకు సెలవొసంగు మన నా కమలాసనుండుం గాంగేయునిఁగాంచి, నీవు సమస్తము, దివ్యదృష్టిచే నెరింగినవాఁడవు అయినను లోకోపకారముకొఱకు నన్ను ప్రశ్నించితివి. నాజనకునివలన వినిన యితిహాసములు పెక్కులుకలవు. పుష్కరుఁడు నదిలోఁబ్రవేశించిన దినమునఁ జేయవలసిన స్వర్ణరజత ధాన్యభూదానములలో భూదానమహిమ యనంతము భూదానము వలన తరించిన మహానుభావుని చరిత్రయొకటి చెప్పెదనాకర్ణింపుము. నర్మదానదీతీరమున రామనగరమను బ్రాహ్మణాగ్రహారము కలదు. అందునివసించు వారందరు పండితప్రకాండులు. కర్మపరులు. సత్యవంతులు, దైవభక్తి పరాయణులు కాని యేమిదురదృష్టమో యా యూరికి నొకక్రూరుఁడు కరణముగా నియమింపఁబడి ఆగ్రామస్థుల నందరిని పెక్కుకష్టములపాలుచేయుచు యీ యమాయకపు ఛాందసులభూముల నపహరించుచు క్రమక్రమముగా నా యగ్రహారీకులఁ బిచ్చగాండ్రను గావించెను. యాగ్రామాధికారికి పరస్త్రీ పరధనముల నపహరించుటయన్న పండుగ హీనపక్షము నిత్యమునకొక హత్యయైన లేనిది కడుపునిండ నన్నము కంటినిండ కూరుకురాదు. నిత్యము చూడిగోవుల నరకుకటిక కసాయికైనను కొంచెము కనికరము కలుగునుగాని, మన కరణముగారికి దయయన నెట్టిదో తెలియదు. అతఁడు బలవంతముగా స్వాధీనముచేసికొనని స్త్రీ యాచుట్టుప్రక్కల నాకాలములో లేదని శపథము చేయవచ్చును. ఒకవేళయుండిన నా స్త్రీ బలవంతముగా ప్రాణములు తీసికొనక తప్పదు. వానికైయేడ్చి చచ్చిన పతివ్రతలు వేనవేలు వానిబాధకు తాళజాలక వానిస్వాధీనమయిన స్త్రీలనుగాంచి సహించలేక బలవంతముగా ప్రాణములను దీసికొనిన పురుషులు లక్షోపలక్షలు వేయేల అకరణ మొనరించిన పాపములు వ్రాయుటకు చిత్రగుప్తుల చేతిలోనుండు గంటములు పదునుపోయినవి అనిచెప్పుట యొక గొప్పకాదు. తుదకు వానియింట కుడితి తొట్టెలో ముక్కుముంచుటకు కాకిభయపడును. యమునికైన జడువని వారుగలరు. గాని వానికి జడియని మానవుఁడులేడు. రాజా

విముక్తిగావించెను. కాని యదార్థపుదానము కాదు. దీనివలన నా బ్రాహ్మణునకు గలిగిన వ్యవహారపుచిక్కు తొలఁగి పోయినది. నరలోకములో యమయాతనల ననుభవించుకరణముగారి కొఱకు హఠాత్తుగా నింద్రలోకమునుండియొక విమానమువచ్చి, కరణముగారిని యమయాతనలనుండి తప్పించి యింద్రలోకముజేర్చిరి. యమదూతలు తెల్లమొగమువైచి, పరువెట్టి తమయేలికయగు ధర్మరాజుగారికి విన్నవించిరి. అంతట చిత్రగుప్తుల ద్వారకరణము కుమారుఁడు పితృప్రీతిగా నొనర్చిన కపటభూదాన మహిమ వలన నీగ్రామాధికారి నరక విముక్తినొందెనని తెలిసికొని భూదాన మహిమను గొనియాడుచు యముఁడు భూమిదాతలకు నమస్కరించెను. గాంగేయా! కపటభూదానమున కింతటి మహిమయుండ యదార్థముగా భక్తిపూర్వకముగా పుష్కరదినములలో భూదానము చేసిన వచ్చు పుణ్యము చెప్పగల మా? గోచర్మ మాత్రముభూమిని దానమిచ్చిన వానిపుణ్యము వచియింప సహస్ర జిహ్వలుగల శేషుఁడు చాలఁడని బ్రహ్మ వచియించెను.



(రెండవకథ)

రెండవదినమందుఁ జేయు గోదానమహిమ.

మహాత్మా! గోదానము చేయుటవలనఁ దరించినవారలు కలరా? యుండిన వారి మహిమయు, చరిత్రయు, వినవలయునని వేడుక పొడముచున్నది యని భీష్ముండడుగా బ్రహ్మ యీవిధముగాఁ జెప్పఁ దొడఁగెను.

శాంతనవా! గోదానముయొక్క మహిమయు, గోవుయొక్కయు మహిమయుఁ జెప్పుటకు ముమ్మూర్తులు సమర్థులుగారన, నావంటివానికి వశమా? అయినను, నీవువేడుక పడి, యడుగుచుంటివి గావున నాజనకుండగు విష్ణుమూర్తివలన వినిన పుష్కరేతిహాసమునంగల గోదానమహిమ యొండుకలదు. దాని వినుపించెద. సావధానమతితో నాలకింపుము.

శ్రీఃధానంబయి ముప్పదిమూఁడుకోట్ల దేవతలకు పూజనీయంబయిన శ్రీశైలసమీపంబునఁ బ్రవహించు కృష్ణానదియందు పుష్కర

మున జరిగిన చిత్రచరిత్రయొక్కటి వక్కాణించెద. కళ్యాణకటకము రాజధానిగా భూమిని, పరిపాలించు వరేణ్యుఁడను రాజశేఖరుఁడు సకుటుంబముగా శ్రీశైల మల్లిఖార్జును సేవింపనరిగి, తిరిగివచ్చుచు మార్గమధ్యమున వచ్చుచుఁ బోవుచుండు జనంబులవలన కృష్ణానది యందు, పుష్కరుఁడు ప్రవేశించుటవిని, తన పురోహితుని వలన పుష్కరమహిమను దెలిసికొని, స్నానముచేసి తరింపఁదలంచి యా నదిని సమీపించి స్నానమాచరించి పితృతర్పణాదులగావించి, నిత్య దానములొనరించి దేవతాపూజగావించి సుఖాసీనుండయిన నదికి స్నా నార్థముగాఁ జనుదెంచు వారలగాంచి యానందించుచుండ నక్కడికి యాత్రార్థమరుదెంచిన వారందఱు సాధువులకు పాత్రులగు విద్వాంసు లకు దానపాత్రులకు, వారివారి యథాశక్తి దానములొసఁగుచు నారో జు పుష్కరుఁడు ప్రవేశించి రెండవది యగుటచే గోదానములు చేయు చుండుటఁజూచి, వరేణ్యచక్రవర్తి పురోహితానుమతంబున నొక దాన పాత్రుఁడు, సత్యరతుఁడు, కర్మిష్ఠి, తీర్థయాత్రాపారవశ్యుఁడగు, భూసుర గ్రామణింగాంచి సగౌరవముగా సశాస్త్రీయముగా భక్తిపూర్వకముగా అర్యమ్ణరూపియగు పరమాత్మప్రీతిగా గోదానమొసంగు నాసాధువు నాహ్వానించి పాదప్రక్షాళనమాచరించి దక్షిణ తాంబూలపూర్వక ముగా సాలంకృత గోదానమునొసంగి పాలుపితుకుకొనుటకు కంచు చెంబు బంగారుకొమ్ములు, వెండిడెక్కలు, కుడితి పోసికొనుటకు నొక గంగాళము సంవత్సరమునకు దగిన ఘాసము. (గడ్డి) నువ్వుపిండి ఉల వలు, మొదలగు పదార్థములతో నాగోవును ఆబ్రాహ్మణునియింటికి బంపెను. ఆక్షణమున దైవయోగంబున నాకాశమున, నాహారము కొరకు బయలువెడలి సంచరించుచుండు నొకపావురమును, డేగ తరు ముకొనివచ్చి ముక్కుతోపొడవగా రెక్కలువిరిగి వరేణ్యమహారాజ పటకుటీరము చెంత నేలఁగూలెను. క్రిందపడి రొలుచు విల, విల, దన్నుకొని నోరుదెరచి స్వర్గలోక ప్రయాణమునకు సిద్ధముగానున్న పావురమును జూచి, పరమదయాళువగు వరేణ్యుఁడు అపిట్టను కాపాడ దలంచి పల్లవములఁబోలిన తన మృదుహస్తములతోఁ నాకలరవమును లేవఁదీసి తొడపై నిడుకొని నోరుదెరచి, వేలవేసిన నాలుకమీఁద దావా

ను దీర్చుటకై గోదాన మొసంగిన బ్రాహ్మణుని పాదము కడిగిన నీరు నమీపమందలి పళ్ళెరమునను౦డగా నాయుదకము పుష్పముతో దీసి, రెండుమూఁడు చుక్కలా పిట్టనాలుకపై చిలకరించెను. పాపపూకల వరము గుటకవేసి మ్రింగినది. యామహారాజు కరుణాళుఁడుగావున దాని బాధఁజూచి, కనులవెంట నీరుగార్చుచు, చేతులకు నాపళ్లెరము లోని, నీరముదికొని, దానిశరీరమంతయు నిమురుచు నోరుతెరచి నపుడు బ్రాహ్మణ పాదోదకము నాలుకమీఁదఁ జల్లుచు, డేగ దెబ్బ వలన వెల్లువయైనచ్చు నెత్తుటిని గోవుత్రాగఁగా మిగిలిన జలముతో కడిగి దుడుచుచుండ, పావురము జీవితకాలము భూమిమీఁద నరిపోవుట చేత కాలమరు నల్లత్రొచు, అదృశ్యరూపమున, నాపిట్ట ప్రాణ వాయువులఁ బీల్చివేసెను. కాలము నరిపోయినవారిని బ్రతికించుటకు దేవుడంతవాని చేతగాదు కదా. రెప్పపాటులోపల భయంకరాకారులగు యమదూతలు యాతనా శరీరమును గొనివచ్చి పావురముయొక్క సూక్ష్మశరీరము యాతనా దేహమునందుఁ బ్రవేశింపఁజేసి, యమలోకమునకుఁ గొనిపోవుచుండ నాకాశమునుండి వేయి సూర్యులు పొడమినట్లు వెలుగురు కనులకు మిరుమిట్లుగొలుపు విమానమొకటి గోలోకమునుండి చుక్కతెగిపడినట్లు వేగముగా యమదూతలముందు వ్రాలెను. యమకింకరులు రిచ్చవడిరి. పావురపు యాతనాదేహ మేమయినది తెలిసికొనలేకపోయిరి. దివ్య దేహ మొక్కటి యాపూల విమానముమీఁద గోమాతచే సేవింపఁ బడుచుండెను. ఎట్టకేలకు యమదూతలు తెలివినొంది తమ యేలిక యగు యమునిఁ బ్రార్థింపఁ బాపపుణ్యాలేఖకులగు చిత్రగుప్తులాపావు రపు పూర్వకృత పాపఫలములఁ బ్రదర్శించు ఛాయాపటమొక్కటి యా విమానముముందు వ్రేలఁజేసిరి. ఆ పటముపై నూరుజన్మముల నుండి యా పావురము చేసినపాపములు యనుభవించిన శిక్షలు లిఖింపబడియుండెను. ఈ పావురపు జన్మకు కారణమైన పూర్వజన్మకథ యిట్లుగా వ్రాయఁబడెను.

ఈమె పూర్వమున నొక బ్రాహ్మణస్త్రీ రెండువత్సరములు భర్తతో కాపురముచేసిన పిమ్మట భర్త గతించెను. అప్పటికి పదు

నారు వత్సరముల ప్రాయము. తండ్రి యంధుఁడు. తల్లి సోదరులు ఆమెను పుట్టినింటికిఁ జేర్చి గారాబమునఁ బెంచసాగిరి. యౌవనోద్రేకమున యామె విటసమూహమునుఁ జేరఁగీసి యింటికడ సర్వదాయుండు తండ్రియు వంశమర్యాదలకై దేవులాడు తల్లిని తన యథేచ్ఛా విహారమునకు భంగకారులనియెంచి యన్నమున విషముఁ బెట్టి వారిని పరలోకమునకనిపి, సోదరుల తన విటులచేఁ జంపింపదలంప నెట్లనో వారాపాలకువ కనిపెట్టి యిల్లువిడిచి పారిపోయిరి. అంతట నామెయింట రాత్రిపగలనక యీజాతి యాజాతియనక పలు గాకిమూకలు పెకుఁలుస్మశానమున చచ్చిన గొడ్డుదొరికినపుడు రాషఃబందులు గ్రద్దలుగుంపులుగూడిన యట్లుగూడిన విటసమూహమును తనయౌవనమున నంతసింపజేయుచు తుదకొకకటికివానిపాలయి గోహత్యాదులయందారితేరికొంతకాలమువానిచే కామసౌఖ్యసముద్రమున నోలలాడింపఁబడి వాని ఘాతకు తాళఁజాలక యొకనాఁడు నిద్రించుచుండ వానినిఁజంపి తాను కుంటెనకత్తెయయి యనేకగృహములఁ గూలద్రోసి సంసారములకు భంగము దెచ్చుచుండ కొందఱు ధూర్తులామెను బలవంతముగా ధాన్యము పాతరవేయుటకుగాను దీసిన గోతిలోఁద్రోసి మట్టిపోసి పరలోకమునకనిపిరి. యమలోకమున నామె చేసినపాపమునకు క్రమముగా శిక్షలనుభవించుచు నేటికి నూరుజన్మములు గడపినది. ఇంక నూరుజన్మములు శిక్షయనుభవింప వలసి యున్నది. ఇదిసంసారమును కూలద్రోసినయిండ్లలో నొకపతివ్రతాదుఃఖ మీ పాపుఁజన్మమునకు గారణము. అంతట గోమాత భృత్యులావటమును జూచి యమభటులారా! యీమెపాపములు నేటికి ధ్వంసములయినవి. వరేణ్యమహారాజు నేఁడొనర్చిన గోదానమున నాగోవుద్రాగఁగా మిగిలిన నీటిలో స్నానము చేయించఁబడినది. గోదానపుణ్యాత్మునిచేత మరణకాలమును స్పృశింపబడినది. ఇది పుష్కరకాలము. కృష్ణానదినుండి వచ్చినగాలి సోకినఁజాలు. ఈపండ్రెండుదినములు చుట్టుప్రక్కల నైదు క్రోసుల దూరమునసుండు మహాపాతకములు భస్మములగును. ఎవరిపుష్కర మహిమయందు నమ్మకములేక పరిహసింతురో యీపాతకములు వారి నాశ్రయించును. పుష్కరము రెండవ దినముజేయు గోదానము యితర స

మయములకంటె కోటిరెట్లు ఫలితమొసంగఁగలదు. గోదానమునకు సంకల్పముచేసి విడిచిననీరు గంగాది మహానదీ ప్రవాహోదకముల కంటె వేయిరెట్లు పుణ్యమొసఁగునని శాస్త్రములు ఘోషించు చున్నవి. అని చెప్పి గోమాతల యమదూతలననుపంపించి యాంభద్ర ముఖుని గోలోకమునకు దీసికొనిపోయిరి. కావున నోశాంతనవా? గోవుయొక్క మహిమ చెప్పుటకు ముమ్మూర్తులు సమర్థులుగారు. మఱియొక పుష్కర సమయమున గోవును దానమిచ్చిన గోవును పూజించిన తుదకు గోపూజను చూచిన బ్రహ్మహత్యాది మహాపాతకములు పటాపంచలై పోవు. అటులనే వస్త్రము ఉప్పు రత్నము రెండవదినమునఁ జేయఁదగిన దానములు అని బ్రహ్మ వచియించెను.

## మూఁడవ కథ.

భీష్ముఁడు గోదానమహిమవిని, యపరిమితానందము నొంది తృతీయదినమందు నొనర్పవలసిన దానములు, వాని మహిమయు వచియింపవలయునని బ్రహ్మను ప్రార్థింపఁగా నా పితామహుం డిట్లనియె.

గాంగేయా పుష్కరపు మూఁడవదినమునందు బెల్లము, శాకము, గుఱ్ఱము, ఫలము ముఖ్యముగా దానము చేయఁదగిన వస్తువులు ఒక్కొక్క వస్తువ దానమొసంగిన మితిలేని పుణ్యమొసఁగును. అశ్వదానమహిమ యింతింతయని వచియింప వలనువడదు. అని పరమేష్ఠి వచియింప, భీష్ముం డిట్లనియె.

ఓ, వేదపురుషా! అశ్వము మిగుల వెలగల జంతువు. అనేకములగు యుపయోగములుండును. కావున హయదానము, మితిలేని పుణ్యమొసంగగలదు. ఫలదానము చేయుట సులభముగదా. దానివలన గూడ మహిమగలదాయని ప్రశ్నింప కమలాసనుండిట్లనియె.

శాంతనవా! నీవట్లు సంశయింపవలదు. శక్తివంచనలేక, భక్తితోఁ జేయుదానము దేశ, కాల, పాత్రములఁబట్టి, ఫలితములందు వ్యత్యాసములుండును. ఉత్తమ కాలమునందు, దగినపాత్రి దొరుకుట, దుర్లభము. అశ్వదానము చేయుసామర్థ్యముగల మహారాజున కెంతపుణ్యమువచ్చును, ధనహీనుఁడు భక్తితో నొసంగిన ఫలదానమున నంత

పుణ్యము సంపాదింపవచ్చును. అట్లయిన, ధనవంతుఁడు ఫలములు దానమిచ్చిన తక్కువ పుణ్యమాయని సంశయమువలదు. శ్రద్ధాభక్తులనుబట్టి కాలమునుబట్టి, ఫలితము చేకూరును. ఫలదాన విశేషమొకటిచెప్పెద నాకర్ణింపుము.

హిమాలయమునకు వింధ్యమునకు నడుమ ఖాండవమను యగ్రహారమొకటిగలదు. అందు వేద, వేదాంగ సంపన్నులగు బ్రాహ్మణోత్తములు పెక్కురుగలరు. అందు భద్రముఖుడను భూసుర శిఖామణి మహాతపస్వి, సత్యవాది, నిరతాన్నదాత, ఏకపత్నీవ్రతస్థుఁడు పరమ భక్తశిఖామణి, పరోపకారపారీణుఁడు. వేయేల! సుగుణములగని, అట్టి మహానుభావుఁడు కాలక్రమంబున లోకంబునఁగీర్తి నార్జించుచు కాలముగడుపుచుండెను. యొకకృష్ణాపుష్కర సమయంబున నాభూసుర శిఖామణి కృష్ణాస్నాన మాచరించి, తన, పొలములో. పండిన, గుమ్మడిపండు శ్రద్ధగాదాచి, యాతీరవాసియగు, పండితునకు భక్తిపూర్వకముగా దానమొసంగెను.

ఆప్రతిగ్రహీత, నిరతాన్నదాతగాన, నానాఁడె యాపండువండించి, పుష్కరస్నానమున కరుదెంచిన బీదపాఱులకు, భోజనము పెట్టించెను. బ్రాహ్మణులు దృప్తిగాఁదిని, తినినంత పారవేయుట స్వభావముగావున నొక బ్రాహ్మణుఁడు గుమ్మడి కూరనుతిని, దాని యందలి ప్రేమచేతఁ బారవేయఁజాలక గొంతువరకు మ్రింగి, హస్త ప్రక్షాళనసమయమందు. వాంతిఁ జేసికొనియెను. కొంచెమునీరు, గుమ్మడి ముక్కలు వెళ్ళిపోయినవి.

బ్రాహ్మణ భోజనానంతరము, ఉచ్ఛిష్టభోజనములుతీసి, వీధిలోవేసిరి. కరువుకాలముకాఁబట్టి యాయెంగిలి విస్తరాకులలోని, యన్నము, కూరలు, భక్ష్యములు, భుజించుటకు, యానాదులొక మూల కాచుకొని యుండిరి. ఒకకుక్క, యాకలిగొని, తొందరతో నాబ్రాహ్మణుని వాంతాశనము (కక్కిన యన్నము) తినుటకు బరుగిడివచ్చి, యన్నమను భ్రాంతిచే, నావాంతిలోఁబడిన గుమ్మడిముక్కను నోటితోకరుచుకొను నంతలో తనయెంగిలివిస్తళ్లు కుక్కతినిపోవునను భయముతో, నాయానాదివాఁడొక దుడ్డుతో మోదెను.

పాపమా దెబ్బ కుక్కకు తలమీఁదఁదగులుటచే నోటనున్న గుమ్మడి
ముక్క గొంతుదిగకమునుపే యా శునకము ప్రాణములు విడువ
వలసివచ్చెను. వాన రాకట, ప్రాణపోకట, యెవరికిఁ దెలియదని
పల్లెటూరి యనాగరికపు స్త్రీలు సామెత చెప్పుచుందురు.
నోటనున్న గుమ్మడి ముక్క, కడుపున చేరుటకు ప్రా
ప్తము లేదు. చూచితివా కర్మపరిభ్రమణ చమత్కారము. అంతట
నా వేపి శరీరమునుండి దివ్యమంగళ విగ్రహ మొకటి బయలువెడలి
తనమేని తళతళలు, సూర్యకిరణములవలె దశదిశల గుబులుకొని,
పిసాళింప, చూపరు లచ్చెరువంది, రిచ్చవడ, భూతమో, ప్రేతమో
పిశాచమో, రక్కసియో, యని యజ్ఞానులు ధైర్యముతో, పిక్క
బలము చూపుచుండ, ధైర్యములవారిది యేమో చిత్రమని వెఱ్ఱి
చూపులతో చూచుచుండ భక్తిపరులు, మహానుభావా, నమస్కార
మని నడుములకు బట్టలు చుట్టుకొని సాష్టాంగపడుచుండ, కొందరు
బుద్ధిమంతులు, పుష్కర దేవత, భద్రముఖుని నిరతాన్న దానము
నకు మెచ్చి ప్రత్యక్షమాయెననుచుండ ఛాందసులు స్వస్తిసామలు
చదువుచుండ నాయూరివా రాబాలగోపాలము క్షణములోపల భద్ర
ముఖగృహాంగణమున నిలువఁబడినది. భార్యాయుక్తుఁడై భద్రముఖుఁ
డుగూడ నాగుంపున నొక చూపరిగా నిలువఁబడెను. అంతట నా
దివ్యమూర్తి యో భద్రముఖుఁడా! నేను, నీ వంశమున పదునెనిమి
దవ పురుషుఁడను. పుణ్యపట్టణమున పూర్వము రెండువేల వత్సరముల
క్రిందట నొక యన్నసత్రమున కధికారినై వ్యవహరించుచు దైవయో
గమున నా సత్రపుసొమ్మునుండి నూరురూపాయలు హరియించితిని.
అధర్మద్రవ్యము హరించిన పాతకమునకు వేయి వత్సరములు మహా
నరకము లనుభవించి అయిదువందల వత్సరంబులు సూకరయోనులం
బుట్టి నూరు వత్సరములు మురికినీళ్ళయందు పురుగులుగా జన్మించి
నన్నూరు వత్సరములనుండి కుక్క పుట్టుకలెత్తుచు, జచ్చుచు క్రమ
క్రమముగా నీగ్రామము చేరితిని. మావంశమున నత్తగుల్లలు పుట్టు
సముద్రముననే ముత్యపుచిప్పలు పుట్టునట్లు నీవు మావంశమున, బుట్టి
సత్కర్మాచరణ నిష్ఠాగరిష్ఠుఁడవై, కాలము వెడలించుచుండుట యోగ్య

Guntaka Kotireddi garu



ఈ పుష్కరదినమున నీ వొసరించిన గుమ్మడిపండు దానము, సత్పాత్రి కొసంగుటచే మనవంశీయులు తరించిరి. దానము పుచ్చుకొనిన చింతామణియను బ్రాహ్మణుడు సద్బ్రాహ్మణులకు చేసిన యన్నదానమహిమ యింతయని వచియింప బ్రహ్మాదులకుం దరముగాదు. బ్రాహ్మణోచ్ఛిష్టమగు నీవొసంగిన గుమ్మడిపండుముక్క రసము నా నాలుక కోసినందున రెండువేల వత్సరములకిందట చేనొసర్చిన పాతకములు నశించి దివ్యరూపముధరించి,పూర్వజ్ఞానముతో బ్రహ్మలోకమరుగుచున్నాడను. పుష్కరదినములలో చేసిన దానము స్వల్పమయినను మితిలేని ఫలిత మొసంగునని చెప్పి, యాపురుషుడు స్వర్గలోకమున కేగెను. ఈ విచిత్రమును చూచిన జనులంతయు భద్రముఖునకు నమస్కరించి పుష్కర ప్రభావమును పొగడుచు వారి గృహంబుల కేగిరి. కావున నోభీష్మా పుష్కరదినమునం జేసిన ఫలదానముయొక్క మహిమ యమితము. ఇంతింతయనరాని పుణ్యముల నొసంగుచుండును. ఈ యితిహాసము పుష్కరదినముల పఠించిన ఫలదానమహిమ చేకూరగలదు. అశ్వదానమహిమ, శాకదాన మహిమయు, విచిత్రముగా నుండును. తరువాత నిమ్మళముగా వచియించెద. సంధ్యాకృత్యములు నెరవేర్చుగొందము అని గంగాతీరమున కరిగిరి.

## నాల్గవకథ తిలతైల దానమహిమ

కౌరవవంశాలంకార! భీష్మ! సావధానుడవగుము తిలలు పితృప్రీతి, తిలతైలము సకలారిష్టములను శాంతింపజేయును. శనిబాధ తొలగించును. అపమృత్యువ నపహరించును. శరీరమునకు బలమొసంగును. న్యూనకు సంతసము చేకూర్చును. నువ్వులనూనె పుష్కరదినములలో నాల్గవదినమున దానమిచ్చుటచే సకలపాపములు నశించును. దీనిం గూర్చి యొకవిచిత్రేతిహాసము శ్రీమహావిష్ణువలన, వినినదివచియింతును. వినుము. తూర్పు సముద్రతీరమున నొక పట్టణముకలదు. ఆగ్రామమున. కృష్ణమిశ్రుండను బ్రాహ్మణుడు షోడశకర్మలు విద్వాంసులనడుమ నిర్భయముగా జేయించగలవాడు. ఆగ్రామము సాలె జాండ్ర బలిజ మొదలగువారిచే నిండబడినది, వారుబట్టలునేయు

వ్యాపారమున వాసిగాంచి ధనవంతులై యుండిరి. ఇతరపట్టణము నుండి వర్తకులువచ్చి బేరసారములు చేయుచు నుండువాడుక కలదు. గొప్పగొప్పవర్తకులు, ధనవంతులు యాగ్రామస్థులు కృష్ణమిశ్రుఁడు పండితుఁడని యాదరించి, వానినే పురోహితునిగా నియమించుకొని, శుభాశుభములు జరుపుకొనుచుండువారు. కృష్ణమిశ్రుఁడు, విద్యావంతుఁడౌగాక, మాటనేర్పరి. ద్రవ్యమార్జించు తెలివితేటలు గలవు. అందటికి దలలో నాలుకవలెనుండి, కొంచెము భూమి చిన్నమేడ, నగ, నట్ర సంపాదించుకొని, అనుకూలవతియగు భార్యతో కాలముగడుపుచు, సంతానములేదను విచారముతప్ప వేరు విచారములేక జీవించుచు, పేరుప్రతిష్ఠలు సంపాదించెను. వేయేల కృష్ణమిశ్రుడుగారు రానిది ఆయూరిలో ప్రముఖులగడపకు పసుపురాయరు. వారుచెప్పనిది పచ్చని తోరణమాయూరిలో కట్టరు. ఇట్లు నలుబదియేండ్లుదాఁటినవి. పిడుగుపడినట్లు కృష్ణమిశ్రునకు, భార్యా మరణదుఃఖము హఠాత్తుగ సంప్రాప్తమాయెను. ఆపదిదినములు దుఃఖపరవశుఁడై, ప్రపంచమంతయు మునిగినట్లుండెను. గాని శ్లో॥ భార్యాహాతా ఛత్రకపాలభిన్నం. అనగా భార్యపోయినగొడుగుమీఁద కొపెరపోయినట్లు పెండ్లాముచచ్చిన పెండ్లికొడుకని స్త్రీలు వచియించినట్లు కృష్ణమిశ్రునకు తిరిగి వివాహమాడ బుద్ధిపుట్టినది. దీనికిముఖ్యకారణము ధనాశభార్యలేనిది పురోహితము నిలువదనియు, సభాపూజ్యత లేదనియు,సంతానము కలుగునేమోయని యింట్లోదీవంపెట్టువారైనాయుండవలదాయనియు యేమేమో యోచనలు చేసి నలుబదియేండ్లుదాటి యేబదియేండ్లుసమీపించెనే,ఇకముందాపిల్లకు తనవలన గలుగఁబోవు సౌఖ్యముస్వల్పమైనయుండునా యుండదాయని యోచనలేక నాశరీరము దార్ఢ్యమైనదని విఱ్ఱవీగుచు కొలదికాలములో యీడేరి తనచేతి కక్కరకువచ్చుకన్యలకై రాయబారుల నంపసాగెను. ఇంతకు సంసారఁము కొంచెము పచ్చగా నుండుటయే యిటువంటికోరికలు పుట్టుట "ధనమూలమిదంజగత్" ద్రవ్యముండినగాని కార్యముండునా? ద్రవ్యాపేక్షకలవారు తమసుఖమే మంటగలుపుకొందురు. పరుల కష్టములు సుఖములు విచారింతురా? ఈరాయబారులు పినాకినీ తీరవాసులకడ చంద్ర

ముఖియను సార్ధకనామముగల కన్యనుగాంచి తలిదండ్రులకు ధనాశ జూపి రెండువేలకా కన్యనుకొని కృష్ణమిశ్రునకు వివాహముగావించిరి. యాచంద్రముఖి పచ్చగాపండిన దబ్బపండువంటి మేనితో పిక్కలపై దిగజారు నల్లగా తుమ్మెదరెక్కలవలె సందెడు తలగట్టుతో, నగలునాణెములు లేకపోయిన నపుడపుడే వెలువడుచున్న యావ కవచభూషణయై సాక్షాల్లక్ష్మివలె తనకంటబడిన చంద్రముఖిని చూచిన తోడనే మైమరపుజెంది పూర్వపు భార్యావియోగదుఃఖము మరచుటయేగాక యిదిగూడ యొకమహాయోగమనుకొని లోలోన నుబ్బిపోవుచు వెంటనే నూరు బంగారు నాణెములకుకొని యామెకు నప్పసినయాభరణములచే యించెను. రెండు వేలు చేతబడినవని తలిదండ్రులు, బంగరు బొమ్మవంటి పిల్ల, రెండు వేలు బలాదూరని కృష్ణమిశ్రుడు, మనకు బత్యమునూరురూపాయీలు దొరకినవని రాయబారులు మితిలేని సంతోషమున మునిగిపోవుచున్నారు. మన చంద్రముఖి మొదట తనకు నొకమారుగా నగలు వచ్చినవని యానందపడినదిగాని యా యానందము మెరుపుమెరసినట్లు వ్వాడేపోయినది. కారణమేమన క్షణక్షణమునకు నాపిల్లకు నభివృద్ధిగొందుచున్న యావనప్రభావము యేబదిసంవత్సరములు సమీపించిన పెండ్లికొడుకు జ్ఞాపకము వచ్చినపుడెల్ల చంద్రముఖి మారుమాటపడి యుబికి పొంగి చెక్కులమీదికి దిగజారు కన్నీరు పరులుచూతురేమోయని భుజము మీదనున్నవల్లెచెంగుతో తుడుచుకొనుచు తలవెంట్రుకలు మాత్రము లేక తనకంటె మూడువత్సరములుమాత్రమే పెద్దయై చక్కదనాల కిక్కయగు గంగయను యక్కగారి మనోవేదన యామె నడవడి దలపోయుచు గాలము గడుపుచుండ కొలందికాలములో పుష్పవతియై కృష్ణమిశ్రుని యింటికి కాపురముచేయబోయెను. క్రొత్తకోడలు. ఆడదిక్కులేదు. ఆమెయె యింటి కధికారురాలు. కృష్ణమిశ్రుడు పడుచుపెండ్లాము నెడబాయలేడు. సమస్త విధములం బోషించుచున్నాడు. చంద్రముఖి రతీదేవివలె యిరుగు పొరుగు వారికి, గ్రామస్తులందరికి మురిపెములమూటయనియు, కృష్ణమిశ్రుని యదృష్టరేఖయనియు గొనియాడ బుద్ధిపుట్టించుచున్నది. కాని పరిశీలించి చూచిన చంద్రముఖి విచారగ్రస్తురాలి

వలెకనుపించకమానదు. కృష్ణమిశ్రుడు యిటువంటి పిల్లనుమొదఁబాయలేకనో, శరీరదార్ఢ్యముతప్పి శుహా తానుచేయువలసిన పురోహితమునకుగానొకప్రతినిధి (అనగా) (గుమస్తా) నియమించి ముఖ్యమయిన పనియున్నప్పుడేగాని చిల్లరపనులన్నియు తనప్రతినిధినెరవేర్చి వచ్చినసామాగ్రి డబ్బు నిత్యము యింటికితెచ్చియిచ్చునట్లు వామనుడను పదునెనిమిదియేళ్ళుపయస్సుగల విద్యావంతుని నియమించి జీవయాత్ర గడుపుచుండె. యాతుఁడ్రవానిది పూగ్రామము కాదు. గావున భోజనములేని పూట నిక్కడనే భుజించుచు చంద్రముఖి సంరక్షణకు లోనై యుండవలసి వచ్చెను కృష్ణమిశ్రుడు, వామనుఁడు ద్రవ్యార్జనాపరులు. చంద్రముఖి సంరక్షకురాలుగాఁ గాలము గడుచుచుండె. చంద్రముఖి మొగము నానాటికి శోభాయుక్తమై విచారకళంకము లేచిపోయినట్లు కనఁబడుచుండెను. వామనుఁడు మిక్కిలి యందగాడు కాకపోయినను అందవికారిగాడు. యౌవనము శరీరలోపములన్నిటినిపోగొట్టెను. ఇట్లు చంద్రముఖి వామన కృష్ణమిశ్రులతో సుఖముగాఁ గాలక్షేపముచేయుచుండెను. ఇంతలో నాగ్రామములో విషూచి జాడ్యము ప్రవేశించినది. [అనగా కలరా] ఆజాడ్యములో కృష్ణమిశ్రుడు కలరాకు నాహారముగాఁ బోయెను. చంద్రముఖి విచారగ్రస్తురాలయినది. కొలఁది కాలములోనే, వామనుని నేర్పరితనముచే నామె విచారము తగ్గిపోయినది. చివరకు చంద్రముఖి చలివిడిచినది. కామసౌఖ్యమునకు గోరువారు అభిమానత్యాగము చేయకతప్పదు ఇంతలో వామనుని భార్య కాపురమునకువచ్చినది. చంద్రముఖి యింతకుముందు, భర్తను, ఉపభర్తనుసాకినట్లు, వామనుడు, భార్యను యుపభార్య చంద్రముఖిని, దిద్దవలసివచ్చెను. కృష్ణమిశ్రుడు పెద్దవాడు. తెలివిగలవాడు. కావున సంసారమును గుట్టుగాఁగడిపినాఁడు. యొకవరలో రెండుకత్తులిమిడిచినాఁడు. ఇప్పుడు చంద్రముఖి తెగించినది. వామనుభార్యగడసుది. వామనునిప్రజ్ఞ వారిముందు బనికిరాలేదు. చంద్రముఖి యింట్లో కాపురము, వామనునిక ప్రాణసంకటమువచ్చినది. ఎట్టకేలకు చంద్రముఖి వామనుని ప్రాణములుతీయుటకు నిశ్చయించినది. దైవవశమున కృష్ణాపుష్కరములు వచ్చినవి. పురోహితుఁడు కావున వామనునకు

బొత్తుగా తీరుబడిలేదు. నాల్గవదినమువచ్చినది. తైలదానములు చాల వచ్చినవి. నూనె యింటికిఁ జేరవేసినాఁడు. చంద్రముఖి వామనుని ప్రాణముదీయుట కాదినమున ముహూర్తము నిశ్చయించి యింటికి దెచ్చిననూనె వామనునకు దానమిచ్చెదనని చెంబులోఁబోసి యాతని భార్యను లోబరచుకొనుటకు, వామనునికి సమస్తపాపనోదనార్థము తైలదానమని సంకల్పము చేయించుకొని, ప్రేమచేత చమత్కార ముగా నాతనికాళ్ళుకడిగి, తైలకుంభము దక్షిణ, తాంబూలము నిచ్చి దానవిధినెరవేర్చి, రహస్యము చెప్పవలయునని గదిలోనికి దీసి కొనిబోయి, యంతకుపూర్వము పొయ్యిమీదనుంచి సలసలకాచిన నూనె నొకమూలనుంచి, స్వతంత్రముగా వామనుని దిగంబరుని గావించి, చంద్రిముఖి, వామనుని రహస్యావయము మీఁద గరిటెడు చమురుపోసెను. వామనుఁడు మాటలేకయె ప్రాణము విడిచెను. చంద్ర ముఖి తనమీదనుండి నేరమును తప్పించుకొన ప్రయత్నించి వామనుని భార్యను గదిలోనికి నీమగడు పిలుచుచున్నాడని, పిలిచి తాను వెలు పలికి వచ్చి యాయింటికి చిచ్చుముట్టించెను. పాపము వామనునిభార్య యీ మాయ తెలిసికొనలేకపోయినది. అగ్ని కాహుతియయినది. ఇట్లు భార్యాభర్తల ప్రాణముదీసి; నాయిల్లు చిచ్చుపెట్టినది వామ నునిభార్యయని వీధినిబడినది పదిమంది పోగయినారు. చల్లార్చినారు కాని వామనుఁడు, భార్యయు యమలోకమున కేగిరి. ఈ నందడి తగ్గునేప్పటికి రాత్రి పండ్రెండుగంటలయినది. చంద్రముఖి యారాత్రి తన ప్రియుడికాడగు విటుని రావించి సర్వాభరణభూషితురాలయి తృప్తిదీర కామసౌఖ్య మనుభవించుచుండ నొంటరిగానున్న చంద్ర ముఖిని, సరసప్రసంగమున మాయపుచ్చి గొంతు పిసికిచంపి నగలు మూటగట్టుకొని పిక్కబలము చూపినాడు విటగాడు. చంద్రముఖి యమదూతల స్వాధీనమయినది. వెంటనే, దేవతావిమానమువచ్చినది. దేవదూతలకు, యమదూతలకు, వివాదముజరిగినది. తుట్టతుదకు నార దుడు మధ్యవర్తిగా నేర్పడినాఁడు. చంద్రముఖి, పాపచరిత్రి పరిశించి నారు. ఆమె నడవడిలో నీ కపటముగా విటుడగు వామనునకిచ్చిన తైలదానము తప్ప యీమె గావించిన పుణ్యములేదు. కానియాదా

నము పుష్కరములో నిచ్చినదిగాపున, నామె యొనర్చిన ఘోరపాత కములన్నియు నశించి, స్వర్గలోకమామె చూడవలసివచ్చె. మఱియు చంద్రిముఖి వామనుని ప్రాణముదీయుటకు ముందు తుదిగా మరగ గాచినపాలు నాభర్తకు పాలుయిష్టము. నీవు నాభర్తవే కావున, పాలుద్రావమని త్రాగించినది ఆదినము క్షీరదానముగూడ చేయఁ దగినదినము. చంద్రిముఖికి నామెయొనర్చినధర్మమే యామెకు సాయమై యామె పాతకములనుండి రక్షించెను. శాంతనవా! ధర్మసూక్ష్మములు గ్రహించుట మిగుల దుర్లభము. దేశకాలములఁ బట్టి దానములు సత్యవాక్కు, పరోపకారము మితిలేని ఫలప్రదములగును. సర్వమునకు త్యాగముప్రధానము. పుష్కరమువంటి, పుణ్యకాలము లభించుట దుర్లభము. ఆ జన్మాంతముచేసిన మహాపాతకములు పుష్కరదినములలో నొక స్వల్పదానముచే నశించి పుణ్యలోకము చేరునని, నారదుడు సిద్ధాంతముచేసి స్వర్గలోకమునకు చంద్రిముఖిని పంపెను.

## అయిదవ కథ - వృషభదాన మహిమము.

నైమిశారణ్యంబున, సత్రయాగసమయంబున, శౌనకాదులు సూత మహామునింగనుంగొని, దానమహిమలనడుగుచుండ, ప్రసంగవశమున పుష్కరకాలంబున నయిదవదినంబున, జేయు వృషభదానము వలనఁగలుగు ఫలముఁ దెలియఁజేయుమని ప్రార్థింపగా, సూతుండు, జాబాలి మహర్షి యీప్రశ్న మున్నొకమారుసేయఁగా వ్యాసచోదితేతిహాసము వచించితిననియు, దానిని మీకాతఁడు వచియించునని చెప్పఁ సూతునిముదలచే సభాసదులకు, హరిః ఓం. అని కథా ప్రారంభముగావించెను.

కర్ణాటక దేశమున గోకర్ణమను పుణ్యక్షేత్రమునకు సమీపమున, సింహనగరమును, రాజధానిగాఁజేసికొని, చండుడను మహారాజు కర్ణాటక దేశమును పరిపాలించుచుండెను.

చండమండలాధిపతి, కఠినహృదయుడు, మాయావి, అనృతవాది. ప్రజలపాలిటి కాలయముఁడు. ప్రత్యక్షరాక్షసుఁడని కీర్తిగడిం

చిన మేటి. చోరులు,జారులు, జూదరులు, త్రాగుబోతులు, టక్కరులు, కుంటెనగాండ్రు యాభూపాలునకు ముఖ్యమంత్రులు, స్నేహితులు, జతగాండ్రు, సేనలు, సేనాధిపతులు, పంచాయితీదారులు, మధ్యవర్తులు సేవకులగా రాజ్యము పాలించుచుండును. యాతని దేశములోని ప్రజలు కంటఁదడిబెట్టి యేన్వకుండ నిదురించిన, రోజుకనబడరు. పతివ్రతలు ప్రతిదినము బలవన్మరణము నెందిరని, వార్తచెవినిపడని, పూటయుండదు.

చండుడు పరద్రవ్యము పరస్త్రీలను, హరించనిది కూడకుడువడు, నిద్రించడు. ఇదివానికి నిత్యవ్రతము. మఱియునాతనికి, జంతువులను, మనుష్యులను, చిత్రవధచేయుట వినోదము. క్రూరమృగముల హింసించుటకు ధైర్యమురాజునకు లేదు. వానియనుచరులా పేరెరుగరు. లేడులను, మేకలను, పిల్లులను, కాకులను, పిచ్చుకలను, గోవులను, గేదెలను నిత్యము చిత్రముగా వధియించున. పిల్లులకు నాలుకగోయించును. గోవులను, రంపముచే నాలుగుకాళ్ళుమాత్రము నరికించి కొట్టుకొనుచుండు గరటలుకాలవేసి నిత్యమువాతలుపెట్టుచు ప్రాణములదీయును.

తనకు స్వాధీనముగాని స్త్రీలను, మొండిమొలలతో, స్తంభములకు రెక్కలువిరిచిగట్టి, నోట గుడ్డలుకుక్కి తేళ్ళచేకుట్టించి, బరమాలతో దినదినము శరీరమున రంధ్రములువేయించి యారంధ్రముల కారముగూరుచు, క్రాగబెట్టిననూనె,చీపుళ్ళతో మూద విదలించుచు త్వరగప్రాణములు పోవకుండ దినమువిడిచి దినముగ్రుక్కెడు మంచితీర్థముపోయుచు రామ రామ వచియించుటకు వ్రాయుటకు దోచనట్టి బాధలువెట్టుచు వారియేడుపువిని సంతోషముతో కేకలు వేయుచు కాలక్షేపముచేయుచుండును. వేయేల చండుని దుండగములు వ్రాయమొదలిడిన యుగములు యుగములు తిరిగిపోవలయును. గాని పాపములుచేష్టలు తరుగవు విరుగవు.

కాలకర్మవశమున తమకు దుష్టప్రభువు సంప్రాప్తమయినందుకు ప్రజలల్లాడి భగవంతుని మమ్ముల త్వరగా జంపుకొనిపొమ్మని దైవప్రార్థన లాచరించుచుండిరి. యైశ్వర్యమదమున కన్నుగానక ప్రజల

నేహుపించుటయేగాని యీ యధికారము యీ సంపత్తు మూడు నాళ్ళ పట్టపగలులో తెల్లవారును. శరీరముమాత్రము శాశ్వతమా? నీటిబుగ్గ. సత్యము తెలిసియుండి మదాంధకారము కనులకుగప్పి తాము ప్రభువులమని విఱ్ఱవీగుటయుగాని, కాలమున కందరు లోబడవలసిన వారే.

చండుడు పాపీచిరాయువనునట్లు నూరువత్సరములు జీవించి, భూలోకములో తాననుభవించవలసిన సౌఖ్యములనుభవించి ప్రజలను బాధించు తెరగులు, నేర్చుకొనుటకోయనునట్లు యమలోకము చూడ బోయెను. యేపతివ్రతయుసురో గొట్టి శీఘ్రముగాఁజావవలసిన వాఁడే. యమలోకమున గలనరకములకన్న క్రొత్తవి చండుని పాతకములకు ధర్మశాస్త్రములు నిర్ణయించ, నానరకకూపము సిద్ధముచేయుటకు భూమిమీఁదనే గొన్నిదినములుంచిరాయనునట్లు చిరకాలజీవిగానుండెను. అదియెవానికి గలగౌరవము. దుష్టసర్పవేయేండ్లు బ్రతుకును. దుర్మార్గులు భూమిపై చాలకాలము జీవింతురు. ముళ్ళకంచకు నీరు పోసి పెంచనక్కరలేనట్లు దుర్మార్గులకే సహాయము దొరకకయే చిరకాలము జీవింతురు.

చండుని మరణమునకు మానసంబున సంతసించనివారుండరు. కాని, బయిటికి విచారమునూచించుచు, కుమారునకు బట్టముగట్టిరి.

చండమహారాజుగారు యమలోకమున శిక్షల ననుభవించుచు తాను భూలోకమున స్త్రీపురుషాదులను దండించునపుడు వారనుభవించు బాధలయందలి కష్టములను తెలిసికొనుచు గచ్చపోదలలో, నుచ్చకాల్వలలో, తేళ్ళగుంటలలో యమేధ్యకర్దములలో నెఱ్ఱగాఁ గాఁచిన యీడ యినుపబొమ్మల కౌగలింతలలో, కాలిన యినుపశలాకలు గ్రుచ్చుటలో కలిగిన సౌఖ్యము లనుభవించుచు యుగాంతరములు గడపెను. పాపములు చేసినపుడు సంతసమేగాని యనుభవించునపుడు కష్టముగా నుండక తప్పునా? ఎన్ని యుగములు గడచినను చండుని పాతకపర్వతములలో నొక యంగుళమైన తగ్గియుండలేదు. కాని వంశము మాత్రము సుఖముగా వర్ధిల్లి మహాసాధువులు పుట్టొంది వంశాభివృద్ధితోపాటు రాజ్యాభివృద్ధి గావించిరి.

తుట్టతుదకు చందుని వంశమున ప్రతీపుఁడను రాజచంద్రుఁ డుదయించి సాధుసేవాపరాయణుండై తన వంశీయుల చరిత్రలు క్రమ క్రమముగా పరిశీలించుచు చందుని చరిత్ర విని యతని పాప ములు పోగొట్టుటకు ప్రయత్నముచేసి దివ్యజ్ఞానము కలవారి నాశ్ర యించి చందుని ప్రకృతిస్థితిని పరిశీలింపగా నా చందుడు యమయాత నలంగుడిచి పదివేల వత్సరములనుండి మరుదేశమున పిశాచమై తాం డ్రచెట్టు మీఁదనుండినట్టు విని, పండితప్రకాండులఁ బిలుపించి మహా సభగాంచి చందుని వృత్తాంతము ప్రకటించి వాని పిశాచ జన్మ బోవు నుపాయము చెప్పుడని వేడఁగా నా సభనుండి జ్ఞాననిధియను మహాముని కృష్ణాపుష్కరము ప్రవేశించినది. అయిదవదినమున పిశా చ విముక్తికొఱకు వృషభదానము గావించిన చందుడు పిశాచత్వము వదలి స్వర్గలోకవాసియగును యని వచియించెను.

ప్రతీపుఁడా పుష్కరదినమున వృషభదానము గావించెను. దానమునొసంగుటయే వ్యవధిగా చందుని పిశాచజన్మవదలి మఱియు యుగాంతము లపర్యంతము అనుభవించవలసిన పాపము లన్నియు నశించి దివ్యరూపము ధరించి మహేంద్రలోకమున మహేంద్రుని యర్ధాసనమున గూర్చుండు యోగ్యత కలిగినది. కావున నో మహా మునులారా! పుష్కరదినములలో వృషభదానము సేయుటవలనఁ గలిగిన పుణ్యము వచియింప బ్రహ్మాదులకు దరంబుగాదని జాబాలి వచియింపం సభ్యులు సంతోష సముద్రమున నోలలాడిరి.

## ఆఱవకథ - కర్పూర దానమహిమ.

వసిష్ఠుఁ డొకనాఁడు గంగాపుష్కర సమయమున కర్పూరదా నము చేయుచుండుటఁగాంచి మహాదాతయగు శిబిచక్రవర్తి గురువు గారికి నమస్కరించి కర్పూర మీనాఁడు దానముచేయుట కేమైన కారణముకలదా? అది మేము వినఁదగన వచియింపవలయునని విన యముగా బ్రార్థించిన శిబిచక్రవర్తింగాంచి వసిష్ఠుం డీవిధముగా వచి యించెను. రాజా! ఇది గంగాపుష్కరము. ఆరవదినము. ఈ దిన మున కర్పూరము దానముచేసిన మిగుల పుణ్యము. కర్పూర దానమ

లేనిపోని నేరములారోపించి, నీసోదరునిచేతఁ గొట్టించుచు, భార్యాభర్తల సౌఖ్యముచూచి, యోర్వలేక, వారిపడకటింటిలోని,పువ్వులు, అత్తరులు, పన్నీరు, అగరుపుల్లలు, దొంగిలించి, యానలపారవేయుచు, వారిసౌఖ్యమునకు భంగముచేయుచు, గొంతకాలము జీవించి కాలధర్మము నొందితివి.

సుగంధ ద్రవ్యములు హరించుటచేత, చుంచుజన్మ నెత్తితివి. చిట్టెలుకవైతివి, నీవుబాధలుపెట్టిన రామ దీక్షితుని భార్యచేత చీపురు దెబ్బలు తినుచు దానివాకిటవసించు వ్రాతవట్టినది. అంతకు పూర్వపు జన్మలో నీవొక స్త్రీని సవతి మచ్చరముచే, విషముపెట్టి చంపితివి. ఆపాపముచేత నిప్పుడు పామునోటఁబడిచచ్చితివి. దొంగిలించిన పువ్వులు, వదినెమీఁది కోపమున, శూద్రముత్తయిదువ చేతిలోపెట్టిన పుణ్యమున, రామదీక్షితుఁడు, పుష్కరములో కర్పూరదానము చేసినయడల నీమీఁద నప్రయత్నముగాఁ బోసినాఁడు. దానివలన నీపాపములు, నీవనుభవింపవలసిన యమయాతనలునశించిపోయినవి. నీవు గంధర్వలోకమున పదివేలవత్సరములు సుఖమనుభవించి మహారాజుకూతురుగాఁ బుట్టగలవు. పాపశేషమున క్షయవ్యాధిచే బాధింపఁబడుచు మరణించగలవు. తరువాత బ్రాహ్మణ స్త్రీవిగాబుట్టి పుణ్యాత్మురాలవై స్వర్గమున కేఁగెదవు. అని విజయుఁడా చిట్టెలుకకు పూర్వజన్మ వృత్తాంతముచెప్పెను. అప్పుడావిమానారూఢురాలయిన దివ్యస్త్రీ రామ దీక్షితుని, భార్యను, చూడవలయును. నమస్కరించవలయును. నాయందు దయయుంచి వారి దర్శనముచేయించవలయునని ప్రార్థింప నావిజయుఁడు యామంగళమూర్తిని రామదీక్షితుల దంపతులకుఁ జూపించి యామెవృత్తాంత సర్వము నివేదించెను. పూర్వజన్మమున ముత్తయను పేరుగల చిట్టెలుక దివ్యజ్ఞానముతో సుందరాకృతితో,వినయవిధేయతలతో, నాపుణ్యదంపతులకు నమస్కరించి తాచుచేసిన యపరాధము మన్నించవలయుననియు నాకు తాముచేసిన యుపకారమునకు నామేని చర్మము చెప్పులకుగాను కోసియిచ్చిన ఋణముదీరదని పలుమారుమ్రొక్కి విమానారూఢురాలయి గంధర్వలోకముచేరి సమస్తసౌఖ్యములు అనుభవిం

చుచు పరమానందము నందుచుండెను. ఓశిబి భూపాలా! పుష్కర దినములలో కర్పూరదానమెగాను, యేదానము చేసిన కోటిగుణిత మయి అనంతఫలితమయి విచిత్రఫలప్రదములైయుండును. అని వశిష్ఠుండు చెప్పగా నాశిగిధరణీరమణుండు వశిష్ఠాను మతంబున పుష్కరదినములలో యథాశాస్త్రీయముగా నియమితదానముచేసి యాస్తికులగు తోడిరాజులకు మార్గదర్శకుడయి భవిష్యద్రాజ శిఖామణులకు నాచార్య రూపుడయి మహాసాధ్వీ రత్నమగు భార్యతోగూడ స్వర్గలోకసౌఖ్యములనుభవించుచు గురుసేవాపరాయణుడయి జీవయాత్రగడుపుచు పావురరూపము డేగరూపమునందివచ్చిన శిఖిహోత్రేంద్రుల పరీక్షయందు శరీరముకోసి ఇంద్రునకిచ్చి పావురము ప్రాణమురక్షించెనను కీర్తినాచంద్రార్కము ముల్లోకములనాటి మృతజీవుడయి స్వర్గలోకమున నివసించె కావున పుష్కరుడు కృష్ణానదిలోఁ బ్రవేశించిన యారవనాఁడు కర్పూరదానము చేయవలయును.

బ్రహ్మమానసపుత్రుఁడు నారదుఁడు భూలోక సంచారము చేయుచు మాల్యవంత పర్వతప్రాంతమున సంచరించుచుండగా నొకవిమానముమీఁదనుండి దివ్యపురుషు డొకడు చనుదెంచెను. నారదుఁడాపురుషుని వృత్తాంత మారయ పొదరింటి చాటున గూర్చుండి చూచుచుండెను.

ఆ పురుషుఁడు సమస్తాభరణ భూషితుఁడై బంగారు పావలు దొడిగి వేత్రహస్తులు ముందుతోనజూవ దేవతాస్త్రీలు పార్శ్వముల వింజామరలు వీవ కొందరు దివ్యపురుషులు వెంటరా నా ప్రాంతమున సరోవరతీరంబునంగల యుద్యానవనంబున కరిగి యందున్న రత్నపీఠమున నివశించి యొక్కింత తడవు గంధర్వాంగనలు నాట్యము నడుప వీక్షించి సరోవరంబున దేవతావారాంగనలతో జలక్రీడల వినోదించి పీతాంబరధారియై పరమేశ్వరు నారాధించి కల్పవృక్షదామముతో నలంకరింపఁబడి కామధేనువువలన సంప్రాప్తములయిన పంచభక్ష్యాన్నములతో నింపిన బంగరు పళ్లెరములు దేవతాంగనలు తీసికొని వచ్చి ముందర నుంచగా స్నేహితులతో సరస సల్లాపము లాడుచు భుజించిన పిమ్మట దాంబూలాదుల గ్రహించి యానంద

మున మునిగి తేలియాడుచు సుగంధపు వాసనలు నలుదెసల పిసారింప దేవేంద్రభోగ మనుభవించి నృత్యగానాదుల కాలక్షేపము చేయుచుండెను. సూర్యాస్తమయము దనుక సరసముగా చూడ ముచ్చటగా గడచినది సంధ్యారాగము నలుదిక్కుల వ్యాపించుచుండఁగనే నా దివ్యపురుషుని మొగము కళాహీనమై దుఃఖరస భరితమయినది. నారదుడు విభ్రాంతిఁజెంది చూచుచుండెను. అంతట నొక దివ్యసేవకుడు వెంటరా విమానమునుండి వచ్చిన పురుషుడు సమీపమున నున్న చవిటిపఱ్ఱ సమీపమునకు బోయెను. అచ్చట నొక్కటియె తాటిచెట్టు. దానికి నొక తొఱ్ఱ. ఈ విమానమునుండి వచ్చిన దివ్యపురుషుని యా సేవకుడు బలవంతముగా శిరస్సు నడుము నొక ముద్దగా వంచి యా తాటితొఱ్ఱలో త్రోసి కాళ్ళు నేల వ్రేలాడుచుండ వానిని విడిచిపెట్టి వెళ్ళిపోయెను. చీకటిపడినది. కాకఘూకాదులు స్వేచ్ఛావిహారములు సలుపసాగెను. అంధకార బంధురమగు నా చవిటిభూమిలో నాపురుషుఁడొకింత కదలుటకు మెదలుటకు వీలులేక నిద్రలేక శంకటములనొందుచు నొకకుప్ప యయినట్లుగా సూర్యోదయ పర్యంత మాపురుషుఁడా తాటితొఱ్ఱలో నిరికియుండెను.

సూర్యభగవానుఁడు తూర్పుకొండ నలంకరించినాఁడు. మంగళవాద్యములతో దివ్యవిమాన మా తాటితొఱ్ఱ సమీపించినది. రాత్రి సేవకుడు వచ్చి యాపురుషుని బలవంతముగా వెలుపలకు దీసినాఁడు. తల్లికడుపునుండి పిండము బయటపడునట్లు సొమ్మసిల్లి యాపురుషుడు బయిటపడినాడు. శరీరమంతయు రక్తసిక్తమయినది. వెంటనే దివ్యాంగనలు అమృతరసము చిలికించినారు. పసినిమ్మపండువలె శరీరము మిసమిసలాడుచు చూపరులకు వినోదము కలుగజేయుచున్నది. నూతనవస్త్రాభరణములు ధరింపఁజేసినారు. ప్రాతఃకాల కృత్యములు జరిగినవి. సిరసంటినారు మజ్జన భోజనాదులు, ఉద్యాన వనవిహారాదులు, యథాప్రకారముగా జరిగినవి. స్వర్గలోకమున వెళ్ళినాడు. నందనవనమున విహరించినారు. సాయంసమయమున యథాప్రకారము తాటితొఱ్ఱలో ప్రవేశపెట్టి వచ్చు సేవకునిఁజూచి నారదుఁడుగారు వీనివృత్తాంతము సవిస్తరముగా వినుపింపుమని కోరగా దేవదూత నారదు

యని రత్నపురంబున కరిగి ప్రకృతము వానికి పదునారవ పురుషుడుగానున్న చంద్రచూడ, నరేంద్రునిగాంచి, విశ్వావసువృత్తాంతమంత, మహాసభలోవచియించెను. చంద్రచూడుడు, నారమునివలన, నద్భుత వృత్తాంతమువిని, విశ్వావసు, ప్రీతిగా, నొకదివ్య సౌధముంగట్టించి, వేదవేదాంగ పారంగతులగు, బ్రాహ్మణబీదకుటుంబమునకు దానమొసంగి వారి నాయింట కాపురముండునట్లు నియమించెను. నారదుండా చంద్రచూడుని వీడ్కొలి, విశ్వావసుని దర్శించుటకు మహేంద్రపురమునకరిగెను. చంద్రచూడు డొనర్చిన గృహదానమహిమచేత, ఇంద్రలోకమున విశ్వావసునకు రత్నఖచితమగు దివ్యసౌధము మహేంద్రుండొసంగెను. ఆయింట సుఖముగా నిద్రించుచున్న విశ్వావసు నారదసంయమీంద్రునిగాంచి, సాష్టాంగనమస్కారమొనరించి, తనకు చిరకాలమునుండి, ఉండనిల్లు, పడమంచముతేదని సకల సౌఖ్యములు వ్యర్థముగాంద పోయుచు, తాటిబోరియలో నిత్యము పడుకష్టము తొలంగంజేసినందులకు నారదునకు తిరుగా సాష్టాంగనమస్కార మాచరించి, నుతియించెను కావలసిన పదార్థములన్నిటిని, యిచ్చి గృహదానము చేయవలయును. చంద్రచూడుడు దానమిచ్చినదినము కృష్ణాపుష్కరమున నేడవదినమగుటచే, స్వర్గలోకమున, విశ్వావసునకు నిత్యముయొక శ్రోత్రరకమగు మేడయు, విచిత్రములగు శయ్యాతలములు కల్పింపబడుచుండెను అప్రయత్నముగా నజ్ఞానముతోనైన కృష్ణా పుష్కరమునంజేసిన దానము స్వల్పమైనను మేరుతుల్యమై తరగని ఫలములు యుగాంతపర్యంత మొసంగుచుండును. ఆదానము, తగిన పాత్ర, తగినకాలము, సమకూరిన, వాని యదృష్టమదుగనా. కావున పుష్కరదినములు వ్యర్థపుచ్చక, కడుపు కట్టుకొనియైన, తగిన పాత్రను విచారించి దానముచేయవలయునని నారదుడు స్వర్గలోకమున ప్రకటించెనని సూతుడు శౌనకాదులకు వచియించినట్లు స్కాందాంతర్గత నదీమహిమా భాగమునంజెప్పబడియున్నది. సర్వేజనాస్సుఖినోభవంతు.

## ఎనిమిదవకథ ఆర్ద్రకదానమహిమ

శ్రీయుక్తమగు కైలాసమున సాంబమూర్తి గజానన షడానన నందీశ్వర, భృంగీశ్వర, చండీశ్వర, కర్తిముఖేశ్వరాది పరివారవృతుండై, సంధ్యాతాండవమాచరించి సంతోషముగాఁగూర్చుండియుండగా వామభాగంబుననున్న పార్వతి, మింటివంకఁజూచి, నాథా! నేడేలకో ప్రొద్దుటినుండి విమానములు, వినువు విరామములేకుండ పరువిడి పోవుచున్నవి. సాయంసమయ తాండవదర్శనార్థము నిత్యం వచ్చు దేవతాకోటిగూడ విరళముగా వచ్చియున్నారు. కారణమేమి యైయుండును. అని ప్రశ్నింపగా నా మహేశ్వరుఁడు మందహాసరుచిరాననుండై పేరియునీ కొండబిడ్డవు. ముగుదవు. విమానములరాకపోకలకు కారణము గావలయునా? నేటికి నెనిమిది దినములనుండి కృష్ణాపుష్కరము జరుగుచున్నది. నేనును నీవునుపోయి స్నానమాచరించి వచ్చిన మాటమరచితివా! యని శంకరుఁడు ప్రత్యుత్తరము నొసంగెను. పార్వతీదేవి శంకరా వినవుమేఁరవి నీమాటలు విచిత్రములు. పుష్కరము తెలియకపోలేదు. నేను మరచినా మీనెత్తిమీఁది దేవత బొబ్బరిల్లిపొంగిపోవుట కనపడుటలేదా! కృష్ణవేణమ్మ పుష్కరమహోత్సవమంతయు భవానమ్మమీదుగానే పారిపోవుచున్నది. అదికాదు యీపూట సందడి మిక్కుటముగా నున్నదిగావున యెక్కువలేమైన యున్నవాయని యడిగితిని, యనుచుండగనే వీరభద్ర భద్రకాళులు విమానమునుండివచ్చి భవానీశంకరులకు నమస్కరించి గూర్చుండిరి.

భద్రకాళీ పార్వతికి తిరుగా నమస్కరించి యత్తగారు పుష్కరమని సహ్యజా (అనగా) కృష్ణానదీ సందర్శనమున కరిగితిమి. అచ్చటమూఁడులోకములలోని ప్రజలు విమానముల మీఁదనుండిచూడ దోమలవలె గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. యీరోజున మిక్కుటముగా భూలోకము పిక్కటిల్లి పోయినదన, నాశ్చర్యములేదు. ఈ రోజున చేయవలసినదానధర్మములు మీకొడుకుగారికి నేమి తెలియదు. ఎవరినైన కొట్టిరమ్మనండి, గబగబ వాని ప్రాణములుదీసి వచ్చెదరు. నాకు నీరోజున చేయవలసిన కృత్యములు చెప్పరాయని యడు

గా యడుగగా నా కేమియు తెలియదు. మీ మామగారి నడిగిన కొండకూతురాయని వెక్కిరింతలు, వేళాకోళాలు మొదలుపెడతారు. ఏమండి! కోడలు యేమి కోరో యడుగుచున్నది, చెప్పండి. పుష్కరమున నేమి చేయవలయునో చెప్పండి. అని కాళి సన్నగిలినది. నా కేమియు తెలియదు. కొండకూతురంటారు, మాటిమాటికి యేమయినా అడిగితే మీ మామగారు అన్నారు. అని పార్వతి యడుగగా శశిశేఖరుం డిట్లనియె.

కృష్ణాపుష్కరమున నెనిమిదవ దినమున దుంపలు, పువ్వులు, గంధపుచెక్క, అల్లము దానము చేయవలెను. ఇంతలో పార్వతి చూచి తివాయమ్మాయి మీ మామగారిని నేనే యడిగినా యిటులనే చెప్పెదరు. అల్లం దానము చెయ్యవలెనట. వెండియా, బంగారమా, దుంపలట, అల్లమట, యేమి తెలియని నాతో మీరనిన నిజమని నమ్మతాను. సరియే. కొడుకు కోడలు కూడ నమ్మరు కదా? యని పార్వతి యిట్ల నియె. భవానీ! పరిహాసము కాదు. ఈ విమానముల గుంపు చూచి తివా? యిటు నమ్మ చిత్రము చూపించెద. లోకములో కొందరు మూఢులు దానములు చేసిన పుణ్యము వచ్చునా యనియు, బ్రాహ్మణులు జీవించుటకొఱకు ధర్మశాస్త్రములు వ్రాసినారనియు, పుణ్యపాపములు లేవనియు నాస్తికులు వాగుచుందురు. దానమునకు కాలము, పాత్రము, శాస్త్రము, యుపయోగము, భక్తి కావలయును గాని వస్తువ వెల గలదియా? స్వల్పమా? గొప్పదియా యను విచారము చేయవలదు. అల్లము దానముచేసిన పుష్పవతి విమానముమీద గంధర్వలోకమున కేగుచున్నది. ఈచిత్రములం జూచుటకే విమానములు గూడినవియని పార్వతిని పిలిచి యా పుణ్యాత్మురాలిని చూపించెను. యామెచరిత్రము నీవిధముగా చెప్పెను.

దండకారణ్య ప్రాంతమున, శృంగబేరమను పల్లెటూరు గలదు. ఆగ్రామమున, భద్రవతియను బ్రాహ్మణవనితకలదు. ఆమె కులాచార ధర్మముల విడనాడి, యథేచ్ఛా విహారములు సేయుచు యౌవనమంతయు గడిపివేసినది. తుదకొక బోయవాని పాలంబడి వానికి దాసియయ్యె, వానికి పాదములొత్తుచు, వాని యాజ్ఞకులోబడి,

వానిచేత దెబ్బలుతినుచు, పడరాని మాటలుపడుచు, వానికుటుంబము నకు బోనకత్తెయయి రాత్రింబవళ్ళు, విధి, విరామములేని, బండ చాకిరిచేయుచు, వానియనుగ్రహము సంపాదించి, వానివలన కామ సౌఖ్యములందుచు, వానిని విడిచిపోలేక, వాడుపెట్టు కష్టములు పడం జాలక, వానినివిడిచిపెట్టిన, ముసలితనముచేత, తనను, పరులుదగ్గరతీ యరు, పొట్టగడవదని భయముచేత వాని వాకిటనే కుక్కవలె పడి యుండి, దొంగతనమునందారితేరి, పెక్కుమాసములు చరసాలలకేగి వచ్చి బోయవానిచేత వెడలగొట్టంబడి, తుట్టతుదకు, కల్లునమ్మునటువు రెడ్డివానిచెంతజేరి వానిచేత బావాయని పిలువంబడుచు, కల్లునమ్ము చు మాలమాదుగులచే పరిహసింపబడుచు, వారికిగులామై, వారలతో గలిసి, మెలసి కాలక్షేపముచేయుచునుండగా దాని యదృష్టవశమున కృష్ణాపుష్కరముగాగా, రెడ్డివానితోగూడ కల్లమ్మునటకు కృష్ణాతీర మునయున్న ముక్త్యపురము చేరినది. యేటిచెంతను దుకాణము వేసినది. రెడ్డిగారు కోమటి దుకాణములో నౌకరు. పెసలు కందులు నువ్వు లు, బెల్లము మొదలగు సరుకులు, దొంగతనముగా, దుకాణమునుం డి తెచ్చి చెడిపోయిన బ్రాహ్మణముండకునిచ్చి అమ్మించుచుండును. ఒకనాడా దుకాణమునుండి బుట్టెడు అల్లము, దొంగతనముగా తెచ్చి కల్లుదుకాణములో పెట్టి యమ్ముమనెను. వయసుచెల్లినను దీనికి పూర్వ పు విటగాండ్లనుచూచినపుడు మనసుపలచంబడుచుండును. కాని దీని మొగము చూచువాడులేడు. బయిటికిమాత్రము, వ్యభిచారము వదలి నట్లు నటించుచు, రెడ్డితో కాలక్షేపము చేయుచు, కామలోలుపయై యుండెను. నిన్నటిదినమున, పుష్కరయాత్రార్థమరుదెంచిన యొక బ్రాహ్మణునకు, పైత్యప్రాబల్యమైయున్మాదము ప్రారంభమయినది. కంటకలికమువేయుటకై, యల్లముకావలసివచ్చినది. నదీతీరమున దొ రకలేదు. వాని తలిదండ్రులల్లాడి ఘోషించుచుండ నా కల్లుపాకలోని యీ మనిషి పుణ్యము పండినది కాంబోలు కొంచెము అల్లపుముక్క పెట్టినది. యీముక్క చితుక గొట్టి కంటిలో రసము పిండినారు. పైత్యము తగ్గినది. పిచ్చి వదలినది. మాటవరుసకు చుట్టుప్రక్కల నుండువారు 'యీతల్లియల్లము ముక్క

బ్రాహ్మణుని బ్రతికించినది' అని స్తోత్రము చేసినారు. ఆమాట రెడ్డి విని నా సొమ్మంతయు దానధర్మములు చేసి పాడుచేయుచుంటివా యని చేతియందుగల దుడ్డుకర్రచే బాదెను. ఆదెబ్బ ఆయము పట్టున తగిలి యాయాడుది చచ్చినది. వాఁడు దుకాణమువదలి పోలీసువారి భయమునకు పాఱిపోయినాఁడు. దాని ప్రాణము పోయినతోడనే యమదూతలు నాగపాశముల బంధించి యాతనా శరీరములో ప్రవేశింపఁ జేసి యమలోకమునకు తీసికొనిపోవ యత్నించుచుండగా స్వర్గలోకము నుండి దేవదూతల విమానము వచ్చినది. యమదూతల తిరస్కరించి రెడ్డిగానిచే బావాయని పిలువబడు భద్రవతిని విమానముమీఁద నెక్కించిరి. చిత్రగుప్తులరుదెంచి యామె పాప పటముల దెలియఁ జేసిరి. ధర్మసూక్ష్మములు గ్రహించుట దుస్తరము గావున నీమె పాతకములు యీ దినమున నామె యొనర్చిన యార్ద్రిక దానమున యామె జన్మ ప్రభృతిచేసిన మహాపాతకముల నన్నిటిని భస్మీపటలము గావించినది. కృష్ణాపుష్కరముల నెనిమిదవ దినమందు చేసిన ఆర్ద్రిక దానమువలన నొక ప్రాణి రక్షింపఁబడినది. యమలోకము చూచుటకుగూడ నర్హతలేదు. పాపపుణ్యములు శుష్కములని, యార్ద్రములని రెండువిధములు. తెలిసి చేసిన పాతకములు శుష్కములు. అజ్ఞానమున చేసిన పాతకములు ఆర్ద్రములు. యీ మహాదానములచేత శుష్కార్ద్ర పాపములు కూడ నాశములందును కావున నీమెను మీరు వదలివేయమని దేవదూతలు విష్ణులోకమునకు భద్రవతిని తీసికొని పోవుచున్నారు. ఆ వేడుకను చూచుటకు దేవతలు గుంపులుగుంపులుగాఁ బోయి యీ పుణ్యవతిని సందర్శించి వచ్చుచున్నారు అని పార్వతికి నా పుణ్యవతి విమానము చూపించి శంకరుడు సంతసింపఁజేసెను. అచ్చటివారందరు యీ విమానమునకు నమస్కరించిరి. పార్వతి యీశ్వరునకు నమస్కరించి తాను పలికిన పలుకులయందు తప్పులుండిన మన్నించుమని నమస్కరించి కోడలునకు పుష్కరవిధాన ముపదేశించి పంపెను.

## త్రొమ్మిదవనాటి కథ

### 1 శ్రాద్ధము 2 పిండదానము

శాంతనవుండు, బ్రహ్మదేవునకు నమస్కరించి దేవదేవా! నా కొక సందియము కలదు. నివారించవలయునని వినయముగాఁ బ్రార్థించి యిట్లనియె.

"శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు । మృగాః కాలాంజనేగిరౌ । చక్రవాకాశ్శరద్వీపే హంసాస్సరసిమానసే...పస్థితాదూర మధ్వానం"

అని యాబ్దికంబున త్వ్రక్తమయిన పిమ్మట పఠింతురు. దీని తాత్పర్య మేమి. దీనిని పఠించుటకుఁ గారణమేమి దయచేసి వచియించవలయుననిన, నావద్మయోని భీష్మున కిట్లనియె. ఇది శ్రాద్ధము పెట్టినందువలనఁ గలుగు లాభమును దెలుపు ఫలస్తుతి. శ్రాద్ధపిండదానములఫలమును బోధించు ఫలపాఠము కథ శ్రద్ధాళుఁడవై వినుము.

మగ రణ్యమున సుతపుడను మహాముని, గృహస్థాశ్రమ ధర్మపరాయణుఁడై సద్యస్కంద యాగములు చేయుచు విద్యార్థులకు పాఠములుచెప్పుచు భగవంతుని ధ్యానించుచు కాలము గడుపుచుండెను. ఇట్లు కాలముగడుపు సుతపుని కడకుఁ గపింజల ఋషీశ్వరుని పుత్రులు నలుగురు విద్యాభ్యాసము చేయుటకు తండ్రికడ సెలవుకైకొని సుతపుని సమీపమున విద్యాభ్యాసముచేయుచు విధివత్బ్రహ్మచర్యము నడుపుచు మధూకరవృత్తి నవలంబించి గురు శుశ్రూషాపరులై విద్యగరచుచుండిరి. వారు విద్యాభ్యాసముచేయు సమయమున కాలక్రమమున ద్వాదశ వర్షక్షామమేర్పడి అనావృష్టిదోషమున పంటలులేక పశువులు త్రాగుటకుగూడ నీరుదొరకక జీవనదులుగూడ వట్టిపోవ నారంభించినవి. మనుష్యుల కన్నోదకములు కరువయినవన వనములు మృగముల గతివేరుగఁ జెప్పవలయునా! మహాటవుల వృక్షములరాపిడి వలనఁ గలిగిన నిప్పు ఘోరంబుగా నడవుల దహించుచుండ వనమృగంబులకు నిలువనీడ దొరకక జనపదంబులఁ జొరబారసాగెను. గ్రామములనుండు పశువులు, మనుజులు, కాననముల పాలుగాఁ జొచ్చిరి.

మనుజులు ఆకలిబాధకుఁ దాళఁజాలక కందమూలాదులుదొరకక పశువుల పోషింపఁజాలక, హోమధేనువుల విడువజాలక బురదగుంటలలో నీరుద్రావుచు రాలిన పండుటాకులలో యెండాకులో తిని కల్యావశిష్టులై మనుజులల్లాడఁ జొచ్చిరి.
విశ్వామిత్రుడంతవానిని మాలగుడిసెలలో నర్ధరాత్రి దొంగతనముగా నెండవేసిన గోమాంసము నాశింపఁజేసినది యాకలిబాధయే గదా! ఇంక సామాన్యులు క్షుద్బాధ సంహింపలేరని వేరుగఁ జెప్పవలయునా? సుతపుని విద్యార్థులు దేశమునకుఁ బోవజాలక విద్యయందలి యాస విడఁజాలక, గురుశుశ్రూష మానలేక జీవయాత్ర శుష్కపర్ణములచేఁ గడుపుచు గురువుగారి హోమధేనువులను పోషించుచు పదివత్సరములుగడిపిరి. క్రమముగా గోవులు లోకాంతరము చేరినవి. కల్యావశిష్టయై యొకటిమాత్రము దినమునకుఁ బుడిసెడు క్షీరముల నిచ్చుచు ఆయుష్కాలము తీరక భూలోకమును విడువఁజాలక యా సుతపుని శిష్యులపాలిటి యమమూతవలెనిత్యము వారిచేత సేవచేయించుకొనుచు జీవించియుండెను. వారు నిత్యము నడువలేని గోవును చేతులమీద నెచ్చటనైన గడ్డిగల ప్రదేశములకు మోసికొని పోవుచు మేతపెట్టుచు కాలక్షేపము చేయుచు క్షామముదీరునట్లు భగవంతుని వేడుకొనసాగిరి.

క్షామము తీరలేదు. గోసేవ వారికిఁ దప్పలేదు. యొకనాఁడు గోవును మోసికొని యడవికిఁబోయి యాకలిబాధ సహింపలేక యా నలుగురు గుమిగూడి రహస్యాలోచనము చేసి యాపద్ధర్మము నిరూపించి యా గోవును చంపి నలుగురు తినుటకును గురువుగారితో పులి వచ్చి గోవును మ్రింగినదని యబద్ధమాడుటకుఁ దీర్మానించుకొని గడ్డిని, దుంపలను త్రవ్వుటకు సాధనములగు చిన్నగాల చిన్న గొడ్డలి, కొడవలి మొదలగు సాధనములతో నాయావును చంప సిద్ధులయిరి.

యాసమయమున నలుగురిలో చిన్నవాఁడు మిగిలినవారిజూచి మనము గోమాంసము భుజింపఁబోవుచున్నాము. ఇది కడుదూష్యము. కారణములేనిది పొట్టకూటికి జంతువును చంపరాదు. పితృప్రీతిగాగాని దేవప్రీతిగాగానిచేసినహత్యహత్యగాదని శాస్త్రవాదులువక్కాణిం

తురు. కావున దీనినిమన పితృదేవతాప్రీతిగాఁజంపి భుజింతమని చెప్ప వారంగీకరించి పితృదేవతల నుద్దేశించి యాగోవునువధియించిరి.మాంసము భుజింపసిద్ధమగుచుండగా నొకడు పితరులపూజించి భుజింపవల యునవారిలో పెద్దవాడు కర్తయయిమిగిలిన ముగ్గురు భోక్తలుగాఁ గూర్చుండి యథాశాస్త్రీయముగా శ్రాద్ధము పెట్టి యా గోమాంస మును నలువురు భుజియించి గురువును సాయంసమయమున సమీపించి గోవు వ్యాఘ్రముపాలయినదని వచియించిరి.

సుతపుడు దివ్యదృష్టిచే సర్వము తెలియఁదగినవాడైనను, శిష్యుల మాటయందలి, నమ్మకముచే, నిజమని, నమ్మియూరకుండెను. కాల క్రమమున, క్షామముతగ్గి, పాడిపంటలు యథాస్థితికివచ్చెను. కపింజల పుత్రులు విద్యాభ్యాసము పూర్తియయిన పిమ్మట, గురువుగారియనుమతిచే, గృహస్థాశ్రమము స్వీకరించి, సత్కర్మానుష్ఠానపరులై: యాత్మవేత్తలై యానలువురు సోదరులు కాలక్రమమున, పరలోక గతులయిరి.

గోహత్యాపాతకము, యనృతదోషము వారిని, శిక్షార్హులగాఁ జేసినవిగాని, యాగోవధ, పితృప్రీతిగాఁజేసినందున పూర్వజన్మజ్ఞానములభించినది. ఘోరనరక బాధలులేక, దశార్ణ దేశములయందు వారు నలువురు కిరాతులుగా నేడుపర్యాయములు పుట్టిరి. కిరాతజాతి యందుద్భవించినను, పితృదేవతావాత్సల్యమున, వారికి పూర్వజ్ఞానము కలుగుచుండుటచేత,దుష్టకృత్యములుచేయక, యీశ్వర ధ్యానముచేఁ గాలముగడుపుచు నేడుజన్మలయినతరువాత, కాలాంజన పర్వత మందు, లేళ్ళుగాజన్మించిరి. అప్పుడుకూడ వారుచేసిన దోషమువారికి స్ఫురించుచున్నది. తరువాత, శరద్వీపముననొక మడుగులో చక్రవాకపక్షులుగా బుట్టిరి. వారికంతకు జ్ఞానాభివృద్ధియగుచుండె. తరువాత వారు మానస, సరోవరమందు హంసలుగాఁబుట్టిరి. హంసలు పూర్వ జ్ఞానమున ప్రతిజన్మయందు పరమేశ్వరుని ధ్యానముచేయుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు గంధర్వప్రభువు మహావైభవముతో స్నానమునకురాగా నొక హంసమునకు, నేనురాజునై పుట్టినబాగుగానుండు నని తలంచెను. రెండవహంస ప్రధానిగానుండదలచెను. మిగిలినహంస

లు బ్రాహ్మణులమై తత్వవేత్తలమై మోక్షమందవలయునని కోరుచు భగవంతు నారాధించుచుండ నొక జాలరివాడు వలవేసి హంసలను తుదముట్టించెను. హంసల కోరికప్రకారము వారి వారి జన్మలు వారికి న ప్రాప్తమయినవి. పితృప్రీతిగా గోవధచేయుమని బోధించినవాడు అర్చించినవాడును బ్రాహ్మణులై విరాగులై పరమహంసలై పరమపదయాత్ర సలుపదలంచిరి. భోక్తలుగా గూర్చుండి భుజించినవారు రాజు మంత్రిగా బుట్టి యైహిక సుఖము ననుభవించుచు యుండిరి. వారికిగల పూర్వజ్ఞానము స్ఫుటముగా ప్రకాశించుటలేదు. యీ సంగతి బ్రాహ్మణులుగా బుట్టిన హంసలు గ్రహించి వారిని భూమిమీద విడిచి వారు వైకుంఠమునకు బోవలేక వారల పిలుచుకొని పోవు యుపాయ మాలోచించు చుండ నొక బీదబ్రాహ్మణుడు విద్యావంతుడు, వివాహార్థము యాచనకు బయలుదేరి మోక్షాపేక్షితులగు బ్రాహ్మణుల పాలికివచ్చి యాచించెను.

అంతట నీవు మొదట చదివిన శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు... ...హంసాస్సరసిమానసె.......................................... యని యొక చీటివ్రాసి యీ కాగితము రాజుగారివద్దకు తీసికొనిపొమ్ము. నీకు వివాహము చేయునని చెప్పి బ్రాహ్మణుని రాజకడకంపగా రాజు చీటిని చదువుకొని మంత్రిచేతికిచ్చెను. అప్పుడు వారికి పూర్వజ్ఞానము స్ఫుటమై మన సోదరులు మహాప్రస్థాన మరుగుచు మనకై నిరీక్షించుచున్నారు. మనలను రమ్మనమని జాబు వ్రాసినారు. ఇవి మన పూర్వజన్మలని తెలుసుకొని యీ బ్రాహ్మణునకు రాజ్యమిచ్చి రాజమంత్రు లిరువురు భక్తియుక్తులై సోదరులను కలసికొని కపింజల పుత్రులు నలుగురు మోక్షమందిరి. పితృప్రీతిగా జేసిన గోవధ మోక్ష కారణ మయినపుడు పుష్కరదినములలో భక్తిశ్రద్ధలతో పితృశ్రాద్ధము, పిండప్రదానము చేసిన వచ్చు ఫలితము వచియించుట దుర్లభము. శాంతనవా! నీవు మిగుల మేధావంతుడవు. నీ భక్తికిమెచ్చి నీవు శ్రాద్ధముపెట్టునపుడు పిండములకై నీముందు చేయిచాచుట మరచితివా. ఆనాడు పిండము దర్భలమీద వేయవల

యునుగాని చేతఁ బెట్టరాదని శాస్త్రమును నమ్మిన నీయట్టి విజ్ఞునికి పిండదానమహిమ చెప్పజాలనని బ్రహ్మ విరమించెను.

## పదియవనాటి సాలగ్రామదానమహిమ

కౌరవకుల భూషణుండగు శాంతనవుండు చతుర్ముఖు నమస్కరించి పుష్కరుడు కృష్ణానదియందు ప్రవేశించిన పదియవ దినమునందు చేయఁదగిన సాలగ్రామదానమహిమ వినవలయునని నాకు మిక్కిలి వేడుకఁ బొడముచున్నది. దయయుంచి వచియింపవలయునని ప్రార్థించగా నానలుమొగములవేల్పు వత్సా శాంతనవా భూమియందలి యిసుక రేణువులు మింటనుండు చుక్కలు లెక్కపెట్టవచ్చునుగాని సాలగ్రామ దానమహిమ గోదానమహిమ వచియింప సమర్థత గలవాడు సృష్టిలోలేడు. సాలగ్రామమునకు వెలలేదు. దానికి వెలయింతయని నిర్ణయించగూడదు. అట్లు నిర్ణయించినవాఁడును అనిర్ణీతమైన వెలయిచ్చి కొనువాఁడును మహానరకముల పాలగుదురు. సాలగ్రామము విష్ణు స్వరూపము. శ్రీమహావిష్ణువు, వజ్రకీటమను నామముతో సాలగ్రామమునఁ బ్రవేశించి తనచిహ్నము లేర్పరుచును. మత్స్య, కూర్మ, వరాహాది రూపములు చక్రరూపములు కలిగి యుండును. గోపాలమూర్తి షడ్భుజ సీతారామమూర్తి లక్ష్మీనారాయణమూర్తి మొదలగు మూర్తులు సాలగ్రామములందు గానఁబడును. నిర్మలమగు మూర్తుల భక్తిశ్రద్ధలతో పూజించిన పరమాత్మ యాపూజ స్వయముగా స్వీకరించును. సాలగ్రామమునందు పదునాలుగు లోకములు కలవు. ఒక సాలగ్రామము దానమొసఁగిన బ్రహ్మాండదాన ఫలితము వచ్చును. శ్రద్ధాభక్తులు గలిగి పూజించుకొను బ్రాహ్మణునకు సాలగ్రామ మొసంగిన నాకల్పాంతము బ్రహ్మలోకంబున నివసించు సాలగ్రామమున కభిషేకము చేసిన నొకయుదకబిందువకు కోక గోదానము చేసిన ఫలమువచ్చును. సాలగ్రామోదకము శిరస్సునఁ జల్లుకొనినఁ గంగాస్నాన ఫలితము వచ్చును. సాలగ్రామము కనులారజూచినఁ పంచమహాపాతకములు నశించును. ఒక్కమారు సాలగ్రామతీర్థము యుద్ధరిణెను పుచ్చుకొనిన

శాశ్వత స్వర్గలోక ప్రాప్తి కలుగును. ప్రాణావసాన సమయమున సాలగ్రామము సమీపమందుండిన యమదూతలు ప్రేతను సమీపించఁజాలరు. వేయేల యెవనియింట సాలగ్రామము పూజింపఁబడుచుండునో యా వాడకట్టున భూత ప్రేత పిశాచాదులు తొలగిపోవును. సాలగ్రామ మే గృహమందుండునో యా యిల్లు సాక్షాద్వైకుంఠమని దేవతలు నమస్కరింతురు. యాయింట లక్ష్మి తాండవ మాడుచుండును. ఋషివరు లాగృహమ్మునుముందర సంచరించుచు కావలికాయుచుందురు. సాలగ్రామార్చన సేయువారిని సందర్శించినఁ జాలును. పాపవాతూల పర్వతములు భస్మమము కాగలవు. సాలగ్రామము పెద్దల నాశ్రయించి తెచ్చుకొని నియమముతో పూజించి తగిన పాత్రమునకు దానమొసఁగిన వానిఫలితము అనుభవైకవేద్యముగాని చెప్పుటకు యింతయని యూహించుటకు సాధ్యము గాదు. కాని సాలగ్రామ తీర్థమహిమను తెలియజేయు యితిహాసమొండుకలదు. సావధానుఁడవై యాలింపుము. పుణ్యకథ లాలించువారికి వినువారికికూడ విశేషమగు పుణ్యమువచ్చును. పుష్కరము పదియువవాఁడు సాలగ్రామదాన మీయలేనివాఁడు యీకథను వినిన దానశతాంశము ఫలితమును సంపాదించుకొనును. దుష్టులగు పాపుల చరిత్రలు వినిన వానిపాపములో నూరవవంతు మనకుచేరును. పాప పుణ్యములు మనము చేయకపోయినను సహవాసమువలన పుణ్యపాపములు చేకూరునని శాస్త్రములు చాటుచున్నవి. శ్లో॥ ఆననాచ్ఛయనా ద్యానాత్సలా పాత్సహ భోజనాత్ । సంక్రమంతీహపాపాని తైలబిందురివాంభసి॥ యనగా కలిసికూర్చొనుట, యొకదిక్కున పరుండుట, యొకరితోయొకరు మాట్లాడుకొనుట, యొకరితోకలిసి నడుచుట, యొకపంక్తిని భుజించుట వీనివలను పుణ్యపాపములు యొకరివి యొకరికిచేరును. పాపులతో సహవాసముచేసిన పాపములు పుణ్యులతోసహవాసము చేసిన, పుణ్యములు, నీటిమీద నూనె చుక్కవలె వ్యాపించి వెంటనే వదలకయుండును. నీటిమీద జిడ్డు తేరుచుండును గావున పుణ్యకథలు వినుటయే ముఖ్యము. నీవడిగిన

సాలగ్రామ దానమహిమ చెప్పనలవి కాదు. తీర్థమహిమచే నీవే యూహించుకొనుము.

సిరుల కిరవయి ధర్మాత్ముల కునికిపట్టయి వీరులకు పుట్టినిల్లయి కర్మ బ్రహ్మవాదులకు నట్టులయి సదాచారములకు తావలమై, సౌందర్యవతులకు సదనమై, రత్నరాసులకు నాకరమై, చదువుల సరస్వతియై సకల సౌభాగ్యములకు కల్పభూజమని లోకములఁ గొనియాడఁ దగిన కన్యాకుబ్జమను పట్టణమునకు పతియయి మదనమోహనుడు రాజేంద్రుడు పరిపాలించు చుండును. యాతని పరిపాలనమందు కుటిలగమనము నరులయందేగాని ప్రజలయందు గానరాదు వక్రత, స్త్రీల ముంగురులయందును చంచలత యబల నేత్రప్రాంతములయందును లేమి నారీరత్నముల నడుముల యందును కాఠిన్యత పక్షుల పయోధరములయందును దయా రాహిత్యము చెరుకు విలుకాని సాముగరడీల యందు మాత్రమె నిలిపి మంచి గంధమున నొక పాదము అగ్నియందొక పాదముబెట్టి ధర్మరాజువలె పరిపాలించుచుండును.

ఒకనాడు దుష్టమృగములఁ జంపుటకై సపరివారముగా మహారణ్యములం బ్రవేశించి పంటపైరులును ప్రజలను పాడుసేయు కఠిన మృగములను జంపి యలసి సమీపమందుగల యొక సరోవరముచేరి యలసట తీర్చుకొని స్నానార్థము సరస్సులో ప్రవేశింపఁబోవుచుండ జాబాలియను సంయమీంద్రుఁడు అంతేవాసులతోఁగూడ మధ్యాహ్నికకృత్యముల నిర్వర్తింప జనుదెంచెను. రాజచంద్రుఁ డా ఋషికుంజరునకు నమస్కరించి కుశలప్రశ్న లారసి తన కృత్యములు నెరవేర్చుకొనుచుండెను. ఋషియు, తన వైదుక క్రియాకలాపము, నివర్తింపఁ జేసికొని యాశ్రమమునకు బోవుచు సపరివారముగా నా రాజరత్నమును తనయింటికి విందునకునిమంత్రించి తీసికొనిపోయెను.

అంతట నా ముష్టింపచుఁడు దేవతార్చనచేసి వైశ్య దేవాదులు నిర్వర్తించి దేవతార్చనయందలి సాలగ్రామాభిషేక తీర్థము మదన మోహానున కొసంగి శిష్యులకిడి మిగిలిన తీర్థ మాశ్రమమున నొకచెట్టు మొదటబోసి వారుభుజించి తాంబూలాదులస్వీకరిం

చి యిష్టాగోష్ఠియయిన పిమ్మట సంయమీంద్రునివలన ధర్మోపన్యాస ములు వినుచుండ తీర్థముపోసిన చెట్టుమొదటి కొక కాకివచ్చి వ్రాలె ను. అందులో సాలగ్రామ తీర్థముతోపూజాక్షతలు (బియ్యపుగింజలు) కూడ పడియుండెను. రుద్రాభిషేక తీర్థము నిత్యము వృక్షమునకు బోయు నీటివలన మిక్కిలి తేమయుండుటచేత సాలగ్రామతీర్థము పూ ర్తిగా నింకలేదు. ఆతీర్థములోనుండు బియ్యపుగింజలమీది యాశచే నావాయసము చెట్టుమొదటగల తీర్థములో ముక్కుముంచి బియ్యపు గింజలను తీసికొనితినెను. రెండు మూడుమారు లాతీర్థముతో గూడిన పూజాక్షతలు వాయసము మ్రింగెను. రాజభటులు మౌని శిష్యులు చూచుచుండిరి. అంతట నా కాకియెగిరి యొకచెట్టుమీద గూర్చుం డెను. కాలమహిమ దెలియుట కాయీశ్వరుడుగూడ సమర్థుడుగాడు. ఆచెట్టు తొర్రలో నొక త్రాచుపాముగలదు దాని విషపుగాలిసోకి నజాలు జంతువులు నిర్జీవములగును. పాము చెట్టుమీదనుండు పిట్ట గ్రుడ్లను మ్రింగుటకు బుసతో బయలు దేరెను. ఆవిషపుగాలికి కాకి మృతినొందెను. కాలముదీరిన ప్రాణమువాయుటకు నేండ్లు కావలయునా పూండ్లు కావలయునా తెప్పపాటుకాలముపట్టదు. ఇంతలో మింటినుం డి దేవదుందుభులు మ్రోయుచుండ కాకనుండి వెలువడిన దివ్యపురు షునిమీద పూలవాన గురిసినది. దివ్యవిమానమువచ్చినది. మదన మోహనుడు భటులు అక్కజంపడి చూచుచుండిరి. ఆదివ్యపురుషుడు జాబాలిపాదములకు నమస్కరించి తన పూర్వవృత్తము చెప్పి తానొక ఋషిశాపమువలన కాకిగాపుట్టితిననియు సాలగ్రామతీర్థస్పర్శచే నాశా పము విముక్తియయినదనియుచెప్పి మోహనునకు సాలగ్రామమహిమ బోధించి యాకాకి స్వర్గమునకుబోయెను. మోహనుడు జాబాలివలన పూజావిధానము గ్రహించి సాలగ్రామమొందు తీసికొని తనరాజ్య ము చేరి సాలగ్రామార్చచే వైకుంఠము చేరెను. కావున సాలగ్రామతీర్థము సోకినమాత్రనే మహాపాపములు నశించుచుండ సాలగ్రామదానము వలనకలుగు మహిమ నీవేయూహించుకొనుమని చెప్పి చతుర్ముఖుడు సృష్టివ్యాపారమున ప్రవేశించెను. సాలగ్రామదానమహిమ వినువారికి సమస్తశుభములు సేకూరును.

## పదకొండవనాఁడు దాసీదానమహిమ.

సూతుఁడు శౌనకాదులకు పుష్కరమహిమయు, విధియు బోధించుచు నేకాదశి దినమునందు గజాశ్వరథదానము దాసీదానము చేయవలయునని బోధింపగా తుందిలుడు దాసీదాన విధానము దాని వలనగలుగు మహిమయు వచియింపవలయునని ప్రార్థింపగా సూతుం డిట్లు వచియింపసాగెను. మునీంద్రులారా! సావధానులుగండు.

ఈ పైనవచియించిన దానములు మహారాజులు చేయఁదగినవి. సంపన్నులగు గృహస్థులకు, దాసీదానము సాధ్యము. గావునశక్తి వంచనలేక దాసీదానముచేయవలయును. దాసీదానము రెండువిధములు. యొకటి దేవదాసి రెండవది సామాన్య దేవదాసి, యనగా, దేవాలయములందు, స్వామికి, నిత్యము త్రికాలములయందు నృత్యగానములుచేయుచు, మంగళహారతులిచ్చుచు స్వామిసేవించుటకుగాను, స్వామికి సమర్పించుట, యొకచిన్నదానినికొని, దానికివిద్యాభ్యాసము చేయించి, నృత్యగానాదులునేర్పి, దానినియావజ్జీవము పోషించుచు స్వామికర్పించుట దేవదాసీ దానము. సామాన్య యోగ్యురాలగు యొకదానిని, యొకసత్కుటుంబమునకు పరిచారము సేయుటకుగాను సమర్పించుట దానిపోష్యము దాతచేయుటచే విశేషము ఫలముకలుగును. లేక యోగ్యతఁగలిగిన మనిషి నొకదానిని, యుపచారముచేయుట కర్పించుట దానివలన సమస్తదోషములు నశించును.

మునీంద్రులారా! దాసీదానముచేయుటచే, తరించిన యొకపుణ్యాత్ముని చరిత్రయొక్కటి చెప్పెదసావధానులుగండు. మంధరపర్వతమునకు సమీపమున, యింద్రప్రస్తమను పుటభేదనముకలదు. ఆపట్టణము, హరికరశాఖవలె, సుదర్శనాశ్రితమై, రమామనోహర, విలాసయుతంబై, సుయోధన సభవలె, భీష్మరాజనందన పరాక్రమాటోవ కథావిశేషంబై, గురుబుధసేవితంబై, సురలోకంబుభాతి ప్రకాశించుచు, ముద్దులమూటకట్టయి సిరికిదానకంబై యలరారుచుండును. ఆ రాజధాని యభినందనుఁడను నృపాలశేఖరుఁడు పాలించుచుండును. అతఁడు ధర్మమూర్తి, భక్తితత్పరుడు, సదాచార పరాయణుఁడు,

ఆర్తత్రాణపారీణుఁడు, రాజనీతివిశారదుఁడు, చుట్టాలపాలిటి కామగవి, యాచక, కల్పభూజము అని ఖ్యాతిగాంచిన సాటిభూవరులలోమేటి యయి, యలరారుచుండెను. ఆతడొకనాఁడు విలాసముగా పర్వతసీమలఁజూచి తన గ్రామమునకు పరిసరోద్యానమున ప్రవహించు సెలయేటిపొంత, దాసదాసీ జనంబులతో విహరించుచు, నాయేటి పొంత విశాలమగు శిలాతలంబున, పాలిపోయిన దేహముతో, శల్యావశిష్ఠుడై గాలియు నీరుమాత్రము, బలవంతముగా స్వీకరించుచుండిన బ్రహ్మచారిఁగాంచి, యాతనిరోగము నివారణసేయుటకు ధర్మవైద్యశాలకుబంపి, ఘనులగు వైద్యవేత్తల కప్పగించి, వానిదేహస్థితి, నిత్యమువిచారించుచుండెను. ఆరుమాసములుగడచినది. రోగముమరలు మొగముపట్టలేదు సరిగదా వ్యాధిస్వభావము గ్రహించిన వైద్యుఁడొక్కఁడైనగనుపించలేదు రాజుగారు వైద్యులరావించి సభచేయించి యీబ్రాహ్మణుని వ్యాధిని మీరు వారముదినములలో బాగుచేయనిచో, మిమ్ముల మావైద్యశాలనుండి తొలగించెదమని శాసించిరి. రాజాజ్ఞకులోఁబడకతప్పదుకదా. అందఱువల్లెయనిరి. రోగనిదానమునకు గ్రంథములు, తిరుగవేయుట ప్రారంభించిరి. ఇదియీవ్యాధి, యీకారణమునఁబుట్టినదని, నిర్ధారణచేయఁజాలకపోయిరి. లంఘనములుచేసిన, శోషిల్లినిది, వైద్యులకన్నుగప్పునది, మనోవ్యాధి, యని యొక బుద్ధిమంతుడు, యీబ్రాహ్మణుని సమీపించి, నీవ్యాధిమిగుల దుర్ఘటమయినది. నీవు చిరకాలము జీవించవు నీవ్యాధికారణము, మేము తెలిసికొనినాము. నీవుదాచవలదు. నీమనంబులోని కోరికనూరు దెలుపవేని నీవునశించుటయేగాక నూరు బ్రాహ్మణకుటుంబములు వైద్యశాలమీద జీవించుచున్నవిశావున మాకుటుంబ వృత్తిపాడుచేసినవాడవగుదువని, వైద్యప్రవరుఁలందఱు బ్రతిమాలిరి. అప్పుడాబ్రహ్మచారి, తనకుగలరోగకారణమురహస్యముగా పుట్టెడుసిగ్గుతో వచియించెను. అంత నావృత్తాంతము రాజుగారికి, విన్నవింప, మహారాజుస్వయముగా వచ్చి, యారోగిని బ్రతిమాలగా, తుట్టతుదకు, ప్రభువుయొక్క బలవంతముమీదను తనప్రాణములమీఁదనున్న తీపిచేతను, తనరోగకారణమీవిధముగా వచియించెను. అయ్యా, నేను భృగువంశీయుఁడను,

నాపేరు రఘుమిశ్రుఁడు. నాతండ్రి మురారిమిశ్రుఁడు, మాయమ్మ విద్యున్మాల. నేను నైష్ఠిక బ్రహ్మచారిని. యథాశాస్త్రీయముగా సాంగాధ్యయనము చేసినాఁడను. తీర్థయాత్రలసేయుచు మంధరమును సందర్శించి, యిచ్చట పుణ్యతీర్థంబుల, మునుంగుచు చిన్నతనమందే గతించిన, మాతాపితలకు దర్పణములు సేయుచు కాలముఁగడుపుచుంటిని. దైవయోగమును గడచిన సూర్యగ్రహణమునకు, నాసెలయేటిబండమీఁదఁగూర్చుని, గ్రశ్న గ్రహ యజ్ఞముసేయుచుండ నీగ్రామమందలి, యొక మేడమీఁద విలాసముగా సంచరించు నొకయువతిని గాంచితిని. నాకనులముందు మెఱపు మెరసినట్లయినది. అప్పటి నుండియు నాకీవ్యాధి యుత్పన్నమయినది. యాహారమురుచి తప్పినది. మంచి తీర్థము విషప్రాయమయినది యిది నా వ్యాధికి కారణమున, రాజమౌళి భయమందకుము నీ వ్యాధి నేఁడు పోగొట్టెదనని, మరునాడు, ప్రాతఃకాలమున తన పట్టణమునంగల స్త్రీలనందరిని, యలంకరించుకొని, యంతఃపురంబునకు రాఁజాటఁబనిచెను. తెల్లవారినది. రోగియు తాను దేవమందిరమున, గూర్చుండి, వచ్చిన స్త్రీలనందఱిని స్వామికి నమస్కరించి, రోగి యొసఁగు ఫలతాంబూలముల స్వీకరించి, వెడలవలయునని దాసీలచేఁజెప్పించెను. అప్రకారము గ్రామవాసులందఱు రోగియొసగిన తాంబూలముల గ్రహించి యిండ్లకుంజనిరి మిగిలినది రాజకుటుంబమొక్కటియె. అంతఃపురాంగనలు రామొదలిడిరి. క్రమముగా నందఱు వెడలిరి. పట్టమహిషియు, నామెకుమార్తెయు వచ్చిరి పట్టమహిషికి తాంబూలమొసగి, యారోగి యామెకుమార్తెకు ఫలమొసంగి, యామెకరము బట్టుకొనెను. యాచిన్నది గంపెడు సిగ్గుతో విదలించి, వదలించుకొనఁజూచెనుగాని, సాధ్యపడలేదు. రాజమహిషి నిలుచఁబడెను. అభినందనుఁడు భార్యను పిలచి, మన పుత్రికను, యీనైష్ఠిక బ్రహ్మచారికి, దాసిగానిచ్చుచున్నాను. కాళ్లుకడుగుటకు నీటిజారితెమ్మనెను. ఆచిన్నది క్షణకాలము స్తబ్ధురాలాయెనుగాని, యీ శరీరము తల్లిదండ్రులది. వారి యిష్టమువచ్చినట్లు సేయుచున్నారని, భక్తితో నిలువఁబడెను. పెనిమిటిమాట జవదాటరాదని, నీటిజారి తెచ్చినది. అభినందనుఁడు, రఘుమిశ్రుని పాదములుకడిగి, తనకుమార్తెను

రత్న ప్రభను, దాసీగాస్వీకరించి, యుపచారములు చేయించుకొను చుండుమని ధారాపూర్వకముగా దానమొసంగెను రఘుమిశ్రుని వ్యాధిగారడివలె మాయమయిపోయినది. రఘుమిశ్రుఁడు యీచిన్న దాని హస్తముస్వీకరించినతోడనే, నావ్యాధినిర్మూలించినది. అన్యథా బుద్ధిలేదు. నైష్ఠిక బ్రహ్మచారి చెంత స్త్రీయుండగూడదు. నీపుత్రిని, నీయిష్టమువచ్చినవానికిచ్చివేయుము. సర్వమునీయధీనము. రోగముపో యినది. తీర్థయాత్రలకుఁబోయెదనని బయలువెడలెను. మీరుభరించ గలిగిన భరించుఁడు. లేనిచో యీసొత్తు మీయదిగాని, నాకుహక్కు లేదని, రాజు, వెడలిపోవుచుండెను. ఈలోపల పళ్ళెరముననున్న, దానోదకము దాసియొకతె విసిరిపారఁబోసెను. ఆపోయుటలో రెండు నీటిచుక్కలు భూమినుండి కింది ప్రక్కనున్న యెండుచెట్టుపైబడెను. చూచుచుండగనే, చెట్టుచిగుర్పుటయేగాక, యాచెట్టు తొఱ్ఱనుండి యీవృక్షమును గూలద్రోచుకొని యొక పిశాచము ఘోరాకృతితో వెలువడి దాసీదాన ధారోదకముతోతడిసిన నేలమీదఁబడి, ప్రాణము లనెడబాసెను. ఈవిస్మయమును రాజకుటుంబము, రఘుమిశ్రుడు వితాకుపడిచూచుచుండిరి. వారికిదేహభ్రాంతియే లేదు. ప్రాణవాయువు లుమాత్రము చక్కగా సంచరించుచున్నవి. ఇంతలో పూలవాన, యీపిశాచము మీఁదను, రాజకుటుంబము మీఁదను చిత్తజల్లుగాఁగు రిసినది. పిశాచమునుండి రాజపురుషుఁడొకఁడు బయలువెడలి, యభి నందనుని కౌఁగలించుకొని, వత్సాభయపడకుము. నేను, నీతల్లి వంశ మున, నైదవ పురుషుఁడను.సుమంతుడనువాడను. చంద్రవంశమందనుం డగు పురూరవుని వంశమువాడను. సకల భోగభాగ్యములనుభవించు చు, విద్యాధనగర్వంబుల క్రిందుమీదుగానక, పండితులను, పెద్దలను, చూచియుచూడనట్లు నటించుచు, సమయమువచ్చినప్పుడగౌరవపరుచు చు కాలముగడుపుచుంటిని.ఇట్లుండ నొకనాఁడు పండితుఁడొకడునిండు పేరోలగంబున సాటిరాజ మండలంబు పరివేష్టించియుండ, చనుదెంచి దేవీ నవరాత్రముల పరాశక్తిని పూజించెద, ద్రవ్యసహాయము కావల యునని యాచింపగా, పదిమందియున్నారనియు వారిముందర, ప్రతిష్ఠ కొఱకు యిరువదియైదు రూకలిత్తునని కాగితముమీద పద్దువ్రాసి

యుంటిని. నాదాతృత్వమునుగూర్చి పదిమంది పొగడిరి. తరువాతనా బ్రాహ్మణుని, ప్రొద్దునయని, సాయంత్రమని, పూటపూటకు త్రిప్పియొకనాడు పండితుఁడురాగా పిశాచమువలె వెంటఁబడినావేమయ్యాయని, కోపదృష్టిసారించి, ద్రవ్యమువదలఁజాలక నాబ్రాహ్మణుని, దిరస్కారముగా బలికితిని అప్పుడాపండితుఁడు, విద్యావంతుడను, నాగ్రహాచారమేమి, నీవెంటఁబడుటకు. సర్వత్రమేము పూజింపఁబడుదుము. వాగ్దత్తముబాకీవంటిది. నిన్నుఋణవిముక్తునిఁజేయుటకే, నేనువచ్చియుంటిని. నీవే, పిశాచమవై, యందఱివెంటబడుమని శపించి వెడలిపోయెను. వెంటనే, పిశాచజన్మవచ్చినది. ఇప్పటికి రెండువందల వత్సరములనుండి పిశాచరూపమున నందరిని బాధించుచుండ, యేబది వత్సరములకు పూర్వమొకమంత్రవేత్త నన్ను బంధించి, యీవృక్షముక్రింద పాతిపెట్టెను. ఇపుడునీవొసంగిన దాసీదాన పవిత్రోదకబిందువులు, చెట్టుమీదఁబడుటచే నాపిశాచజన్మవదలిపోయినది. నేను స్వర్గమునకుఁబోవుచున్నాను. ఓరఘుమిత్రా, నీవు వివాహమాడక పోవుటచే, నీపితరులు నరకమునఁబడపోవుచున్నారు. నీవు బ్రాహ్మణకన్యను వివాహమాడి నాదాహితిని స్వీకరించి సుఖపెట్టుము. మీయిరువురకు సేవసేయ రత్నప్రభ, యుభయవంశములను తరింపజేయునని చెప్పి స్వర్గమునకుఁబోయెను. కావున దాసి దానప్రభావమింతింతయని, వచింపనలవికాదు. ఇంక పుష్కరదినములలో దానముచేసినవారికిగలుగు ఫలము బ్రహ్మాదులుగూడవచింపలేరని సూతుఁడువచియింప ఋష్యాదులందఱు మహదానందముఁబొంది అనంతర కథాశ్రవణకుతూహలులైరి.

## పండ్రెండవనాఁటి యజాదానమహిమ.

ఇక్ష్వాకు చక్రవర్తి రాజ్యము చేయునపుడు రాజభటుఁడొకడరుదెంచి దేశవృత్తాంతములు చెప్పుచు పండరిపురమునకు పదిక్రోసుల దూరమునందు నొక గొల్లయిల్లాలు చూచినవారి పూర్వజన్మవృత్తాంతము చెప్పుచుండెనని చెప్పెను. ఇక్ష్వాకుడాశ్చర్యపడి తన గురువరుండగు వశిష్టుని రావించి, మహాత్మా, మాభటుడొకఁడు సినారాయనుపల్లె గ్రామమునందొక యాభీరవనిత పూర్వజ్ఞానముకలది.

కలదని వచించెను. మనము చూచివత్తమాయని ప్రశ్నించెను, వశిష్ఠుడా మాటవిని, యిది పుష్కరసమయము. మహాబలేశ్వర సమీపమున కృష్ణానదికలదు. పుష్కరుడా నదియందు ప్రవేశించును. తీర్థయాత్రకు బయలు వెడలవలయునని మా ఋషికులము ప్రయత్నించుచున్నది. నీవును సపరివారముగ బయనముకావలయునని వచియించెను. ఇక్ష్వాకుండు బయనమాయెను. మహాఋషులు పరివారము, ముందు వెనుక రాగా మహావైభవముతో, నడనడ, పుణ్యతీర్థముల దర్శించుచు ధర్మముల నుపన్యసించుచు భక్తవరుల సేవించుచు ప్రకృతి చిత్రముల కన్నులవిందుగ మహాపురుషుల పాదసేవలు సేయుచు పండరిపురమునకరిగి అప్పటికా దేవళమందు వసియించియుండిన రంగనాయకుని సేవించి, చంద్రభాగా స్నానమాచరించి, పితరుల తృప్తిపరచి రంగనాధునకు కైంకర్యము గావించి, మూడురాత్రులు జాగరణము గావించి, యచ్చటికి సమీపమునున్న సినారాయను గ్రామమునంగల గొల్లదానిని చూచుటకు బయలుదేరి పోయిరి. ఆయువతి పేదరాలు. ఒకపర్ణకుటీయందు నివాసముచేయుచు మేకలను యొకగోవును,సమీపారణ్యమున మేపుకొనుచు వాని క్షీరముల న్యాయమయిన వెలకు విక్రయించుచు మిగిలిన క్షీరమున సమీపముననున్న ముక్తిలింగస్వామి కభిషేకించుచు సుఖముగా గాలము పుచ్చుచుండెను. మహారాజు సినారాసేరి డేరాలువేయించుకొనివిడిసిరి. చుట్టుప్రక్కలనుండు యాటవికులు, ఏనుగుతలలోనుండు ముత్తియములు, పులిగోరులు, ఉత్తరేణిబియ్యము, పుట్టతేనియ, పులిజున్ను, అపుడుకాచిన యావునెయ్యి, పిచ్చుగంధి, కావెళ్ళతోదీసికొని మహారాజును సందర్శించి, వారికష్టసుఖములు చెప్పుకొని కూర్చునియుండగా, నాగొల్లవదుచు ముంతెడుగోక్షీరము దీసికొని రాజసందర్శనముచేసి, యంతఃపురాంగనలంజూడఁబోయి,వారికాయడవినుండుజంబూఫలములు,చారపప్పు,అత్తిపండ్లు, రాగిఫలములు, రామాఫలములు సమర్పించి, మహారాణిని, చూచి అవ్వా నీయదృష్టముమంచిది. మావంశము తరింపఁజేసితివి. మీయమ్మయు, మీతల్లి తల్లియు, రెండు వందల వత్సరములవారు దృఢముగానున్నారు.నీవువారి కంటెబలహీనముగాఁగనబడుచున్నావు.

—

నీయాకారము నీవిభవము మీయమ్మకుఁజూపించిన, సంతోషింతురు. వచ్చిచూచిపొమ్మన, నారాణి దీనినిగాంచి, అవ్వానీకు పిచ్చియా, యనియె. అంతనాగొల్లది- నీవాడుకొనిన, చిన్నముంతలు మీయమ్మ మ్మదాచిపెట్టినది. మంచివంగడమునఁబుట్టిన దైవయోగమున నీకిట్టి దుర్బుద్ధిపుట్టినది. దానికి భూమిమీఁదిగింజలు సరిపోయినవి. శిలలవలె మేముఁబతికియున్నాము. అని, నిత్యము మీయమ్మకంటఁదడిపెట్టుచునే యుండును. అనితిరిగిచెప్పెను. అంతటనామెదాసి, గొల్లదానినితిట్టి నీకు మతిలేదా, మాయమ్మగారిసి వరియాచకము మొదలుపెట్టినావా. యని, చివాట్లుపెట్టుట ప్రారంభించినది. గొల్లది అమ్మా మూడు నాళ్ళముచ్చటకింత వేగిరపడకుము. నీవాయింటి ప్రక్కనుండు చాకలవాని గాడిదవు. మీనాయనగాడిద, ముసలివాడయినాడు. కానిబట్టలుమోయుటతప్పలేదు. అనుచుండ, నలుగురుదాసీలు యీముండపిచ్చిముండయని పట్టినెట్టుచు తిట్టికొడలఁగొట్టిరి. యాపెయేడ్చుచు, నిజముచెప్పిన నిష్ఠురముకాదాయని విచారపడుచు పోవుచుండెను. వసిష్ఠుఁడాయతివనుగాంచి, ముఖకవళికనుబట్టి దానియందుగల ప్రజ్ఞావిశేషమును కనిపెట్టి దానిఁబిలిచి, నీ వెవ్వతెవు. ఎటకేగుచుంటివని, ప్రశ్నించెను. అంతట నావేత్త మహామునికి నమస్కరించి, పిచ్చిగుంటమీఁద, గంగా ప్రవాహమువలె, మహాత్మ లీరు గ్రామము పవిత్రము సేయుదలచినారు. దేవరమై గాలిసోకిన యీ పల్లె పవిత్రసదనమైనది. ఇనుము పరుసము సోక బంగారము కాక మానునా? యన, ఇక్ష్వాకు మహారాజుగారు, నిన్నుఁ జూడఁదలంచి యిటు దయచేసినారు. వారిని సందర్శించుట మనకందరికి, ముఖ్యమన వారు మాయింటి యల్లుఁడెగదా. మాయాడ మనుసే నన్ను పిచ్చిదాన్ని చేసినదిగా. పూవులనుగూర్చిన దారముఁరాజుల మౌళి నలంకరించినట్లు మీశిష్యులకు లోవములుండునా. గౌరవమురాదా యని పక్కున నవ్వెను. వసిష్ఠుఁడు మహారాజును పిలిపించి యాగొల్లపడుచును చూపించెను. ఇక్ష్వాకుఁడామెకు నమస్కరించి అమ్మాయి, నీకీ దివ్యజ్ఞానము లభించు కారణము వచియింపఁ గలవాయని యడిగిన యాయువిద యీపేదదానిమీఁద నింతయు కారణ దయరాగతమేమి.

సర్వము దైవాధీనమని, ఆర్యా వెనుకటి కృష్ణా పుష్కరమునకు, నొక బ్రాహ్మణుఁడు బాగా చదివిన ఆయనే యీడకువచ్చి, యజ్ఞ మునకు తెల్లరోమము అంత నల్లమెంటి కుండది అసలే పనికిరాదంట. ఎతికి యెతికి నామందలో తల్లిపాలిడిసిన అంతగద్దు ఉంటేను నన్నడి గుండు. అప్పుడు దరబాగుంది. నాలుగు వరాలు సెప్పినాను.యీాయ లేనంటే యీాయలేనని రెండొరాలు సేతమెట్టి పుష్కరదినాలు మేక పిల్లను దానమిత్తె, ఎంతోపుణ్య మన్నాఁడు. అంతట తానంచేసి రా మ్మని, ఓకానిడబ్బును దోసెడునీళ్లుఆబ్రాహ్మనాయునకు యిచ్చేసి మేక పిల్లనుదోలుకెల్లమన్నాను.ఆ రెండరాలు ఆయనకే యిచ్చేసాను.ఆయ నకొండంతయి పోయినాడు. ఆమరుసటి దినమునుండి నాపూర్వజల్మ నన్ని నాకళ్ళముందర దిరుగుచున్నవి. మనరాణిగారి, యమ్మ, యమ్మమ్మ, యిప్పుడున్నారు. రెండువందల యేండ్లక్రిందట మాామ డిసే, చినతనాన మొగుడు పోయినాఁడు. కూత్రె అందమైన గుంట లెగండి. కులపువాణ్ని యిడిసిమెట్టి, పాడు పనిలోబడ్డది.తల్లి, ఆళ్ళు, యిడిసిమెట్టినారు. ఆడు యిది కలిసియుండగా నొకనాటి యర్ధరేతిరి కాడ దీర్ఘతపుఁడను యొక గుర్డ్డి ఋసి వానలోతడిసి, వణకుచు, దీనిగుమ్మంకాడ పడిపోయినాడు. అంత, యిటకాడు యిది ఆరున య్యాకు వళ్లు తుడిసి, చలిమంటయేసి యెచ్చని బట్టముక్కలిచ్చి,కాళ్లు పిసికి, ఫలహారముపెట్టి, పరుపుమీాద పండబెట్టి యీారాతిరి యుపచా రము చేసినారు. ఆమహాత్ముని యుదరగోళమందు పడిన ఫలహారము యుపచారముల ఫలములు పండి యిపుడు రాణి యయినది అని చెప్పెను. దానివిటుడో యని రాజిదుగా వసిష్ఠుడు వినఁదగినది వి న్నాము. మనమా యింటికిబోయి యా వృద్ధులను చూచివచ్చుట మీాదంపతులకు ముఖ్యమన, మహారాజట్లు చేసెను. ఆముసలమ్మలు మాాయింటి పిల్ల యిట్లనే యుండేది యని కన్నీరునించ, వారి దరిద్ర విచ్ఛిత్తుగ ద్రవ్యమిచ్చి వశిష్ఠాదులతోగూడి, మహా బిలేశ్వరమువద్ద నుండు, కృష్ణానదియందు పుష్కరముగడిపి, పండ్రెండవ దినమందు చేయవలసిన గోదానాదులు, షోడశ మహాదానములుచేసి, అజాదాన ముచేసి, ఋష్యాదులతోగూడ నింటికి చనుదెంచెను. కావున శౌన

కాదులారా, అజ్ఞానమువలన జ్ఞానాభియగును. దానము చేయ లేనివారికథనైనవినినపుణ్యమువచ్చును. పుష్కరమహాత్మ్యమువినిన, వినుపించిన, పుష్కర కృత్యములవలన గలుగు ఫలములో పదునారవ పాలు లభింపగలదు.

## ఫలశ్రుతి

గీ॥ సరసనున్నది తల్లి కృష్ణా భవాని
కాచుచున్నది కనకదుర్గామతల్లి
పుష్కరుండువచ్చి కృష్ణలో పూనినిలిచె
ఫలముగాంచుడు బెజవాడ పౌరులార॥

విద్వత్కవి
మల్లాది అచ్యుతరామశాస్త్రి,
S. K. P. V. V. హిందూహైస్కూలు,
ప్రధానాంధ్రోపాధ్యాయుడు, బెజవాడ.



# వస్తుగుణప్రదీపిక.

(గ్రంథకర్త:—(గంధి వెంకటసుబ్బరాయశర్మగారు.)

ఇదియొక మహోద్భుతగ్రంథము. దీనితో సమస్త మానవకోటికిని ప్రయోజనము గల్గియుండును. “జీవన్ భద్రాణిపశ్యంతి” అనియును “శరీరమాద్యంఖలుధర్మసాధనం” అనియును పెద్దలు వచియించియున్నారు. శరీరమే ప్రపంచలీలలకు సాధనము. శరీరమును రక్షించుకొనవలయునని నచో ప్రాణి యారోగ్యశీలుఁడై యుండక తీరదు. ముఖ్యముగా మనము భుజించు పదార్థములే శరీరమునందు ఆరోగ్య అనారోగ్యాదిభేదములను కల్పించుచుండును. మనము తినువస్తువుల యందు ఎట్టిగుణములు గలవో అవి మనకు ఉపకారము చేయునో అపకారము చేయునో, తెలిసికొని భుజించినయెడల మన మెట్టి రోగములకును గురిగాక శరీరములను వజ్రసన్నిభములనుగాఁ జేసికొనగల్గుదుము. అందులకు వస్తుగుణప్రదీపికయే ఆధారము. ఈగ్రంథము సమస్త వస్తువులతత్త్వమును బట్టబయలుగావించును. సంజీవివంటి ఈగ్రంథము మనయింటనున్నచో, ఏవైద్యులతోడను, ఎట్టి ఔషధములతోడను ప్రయోజనము గలుగదు. కావున నీగ్రంథము మనపాలిటి సంజీవి. అంతరంగికుఁడగు గృహవైద్యుడు. మన ధన ప్రాణ సంరక్షకుఁడగు ధన్వంతరి. ఒకగ్రంథముకొరకు నేడే కార్డువ్రాయుడు. అనేక దినముల నుండియు ఈ గ్రంథముకొరకై ఆంధ్రమహాజనులందరును, ఆశావీక్షణలతో ఎదురుచూచుచున్నారు. ఆవగింజ మొదలుకొని అమృతము వరకునుగల భూతలమునందలి సమస్తపదార్థములయొక్క సుగుణావగుణములను కన్నులకు గట్టినట్లు వివరింపగలదు. వస్తుతత్త్వము నెరింగిన పిదప మనకింత ధననష్టముగాని ఆరోగ్యనష్టముగానియుండదు. సర్వజనసౌలభ్యమునకై సరసమగు ధర నిర్ణయింపబడినది.

వెల రు 4—0—0 మాత్రమే.

వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీ





బెజవాడ

శ్రీరామ ప్రింటింగువర్క్సునందు

ముద్రింపబడియె.


ప్రకటనకర్త

**మరుకూరిసుబ్బారావు**

**సరస్వతీ బుక్ డిపో,**

**బెజవాడ, కృష్ణాజిల్లా.**

# సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ఆంధ్రదేశమందు ప్రఖ్యాతిగా ప్రదర్శింపబడుచున్న నాటకరత్నములు.

| నాటకములు. | | రు. | అ. | నాటకములు. | | రు. | అ. |
|---|---|---|---|---|---|---|---|
| సత్యహరిశ్చంద్రీయం | బ॥ల॥ | 1 | 0 | సావిత్రిసాంగ్సు | పా॥కాం॥ | 0 | 12 |
| బుద్ధిమతీవిలాసము | డిటో | 1 | 0 | ద్రౌపదిసాంగ్సు | ,, | 0 | 12 |
| రంగూన్ రౌడీ | సో॥రా॥ | 1 | 0 | ప్రహ్లాదసాంగ్సు | ,, | 0 | 12 |
| భోజకాళిదాసు | డిటో | 1 | 0 | చింతామణి | కా.నా. | 1 | 0 |
| గంగావతరణము | డిటో | 1 | 0 | వరవిక్రయం | ,, | 1 | 0 |
| భీష్మబ్రహ్మచారి | డిటో | 1 | 0 | మధుసేవ | ,, | 1 | 0 |
| సతీఅనసూయ | డిటో | 1 | 0 | చిత్రాభ్యుదయం | ,, | 1 | 0 |
| మహాభక్తవిజయం | డిటో | 1 | 0 | పద్మవ్యూహము | ,, | 1 | 0 |
| ధరణికోట | డిటో | 1 | 4 | పాదుకాపట్టాభిషేకం | పా.ల. | 1 | 4 |
| ప్రతాపరుద్రీయం | డిటో | 1 | 0 | రాధాకృష్ణ | ,, | 0 | 12 |
| తాజ్‌మహల్ (జహనార) | | 1 | 0 | కంఠాభరణము | ,, | 1 | 0 |
| రామదాసు | డి॥ గో॥ | 1 | 0 | బొబ్బిలి | శ్రీ. కృ. | 1 | 0 |
| రాన్‌కబీర్ | డిటో | 1 | 4 | కనకతారానాటకం | చం. కే. | 1 | 4 |
| కృష్ణలీల బళ్ళారి | కె॥ సు॥ | 1 | 4 | తులసీదేవి | ము. వేం. | 1 | 0 |
| లవకుశ | డిటో | 1 | 4 | శ్రీకృష్ణతులాభారం | ము.సు. | 1 | 0 |
| సంపూర్ణమహాభారతము | | 1 | 0 | ఉత్తరరాఘవము | బ. ల. | 1 | 4 |
| ద్రౌపదీవస్త్రాపహరణం | మ॥అ॥ | 1 | 0 | సాత్రాజితీయం | ,, | 0 | 14 |
| సతీప్రతాప్ అనసూయ | సో॥అ॥ | 1 | 0 | విప్రనారాయణ | పా.ల. | 1 | 0 |
| కన్యాశుల్కము | గు॥ అ॥ | 1 | 0 | చండిక | ము. వేం. | 1 | 0 |
| రసపుత్రవిజయం | గ॥ యా॥ | 1 | 0 | వేణీసంహారము | వ. సు. | 1 | 0 |
| రాణాప్రతాప్‌శింగ్ | ,, | 1 | 0 | సావిత్రి | శ్రీ స. | 1 | 0 |
| చంద్రగుప్త | సం॥ శి॥ | 1 | 0 | గయోపాఖ్యానం | చి. ల. | 0 | 8 |
| దుర్గాదాసు | జం॥ శి॥ | 1 | 4 | కాళిదాసు | అ.హ. | 1 | 0 |
| రాణాప్రతాపసింహ | ,, | 1 | 0 | శివలీల | ము. వేం. | 1 | 0 |
| జయంతజయపాలం | ఆ॥క॥ | 0 | 12 | శ్రీరామాంజనేయం | పి.చి. | 1 | 0 |

| నాటకములు. | | రు. | అ. |
|---|---|---|---|
| రోషనార | కొ.సు. | 1 | 0 |
| భీష్మ | జం.శి. | 1 | 0 |
| శ్రీకృష్ణ తులాభారం సాంగ్సు | చం. కే. | 0 | 12 |
| రాధాకృష్ణ సాంగ్సు | ,, | 0 | 12 |
| పాండవవిజయం | తి.వేం. | 1 | 2 |
| శ్రీకృష్ణతులాభారము | | 0 | 8 |
| శ్రీకృష్ణరాయబారము | | 0 | 8 |
| పాదుకాపట్టాభిషేకము | | 0 | 8 |
| రాధాకృష్ణలీల | | 0 | 8 |
| పాండవాజ్ఞాతవాసము | | 0 | 8 |
| కనకతార | | 0 | 8 |
| వృద్ధవివాహము | | 0 | 8 |
| సంగీతసావిత్రి | | 0 | 8 |
| సారంగధర | | 0 | 8 |
| జయంతజయపాలము | | 0 | 8 |
| కాంతామతి | | 0 | 8 |
| రోషనార | | 0 | 8 |
| ఉషాపరిణయము | | 0 | 8 |
| పద్మవ్యూహము | | 0 | 8 |
| రామదాసు | | 0 | 8 |
| కుశలవ | | 0 | 8 |
| సంగీత శశిరేఖ | | 0 | 8 |
| సతీఅనసూయ | | 0 | 8 |
| సతీతులసి | | 0 | 8 |
| వరూధిని (మనుచరిత్ర) | | 0 | 8 |
| సంగీతవిష్ణులీల | | 0 | 8 |

| నాటకములు. | రు. | అ |
|---|---|---|
| సతీసక్కుబాయి | 0 | 8 |
| సంపూర్ణోత్తర రామాయణం | 0 | 12 |
| లంకాదహనం దో.సీ. | 0 | 8 |
| హనుమద్రామసంగ్రామము | 0 | 8 |
| శ్రీకృష్ణమనశ్శాంతము | 0 | 8 |
| రుక్మిణీపరిణయము | 0 | 8 |
| సంగీత గోపీచంద్ | 0 | 8 |
| శ్రీనాథకవిరాజీయము | 0 | 12 |
| ఊర్వశీశాపవిమోచనము | 1 | 0 |
| పాండవజననము | 0 | 8 |
| సుభద్రావిజయము | 0 | 8 |
| **వివిధరకములు.** | | |
| సావిత్రి భజనకీర్తనలు | 0 | 4 |
| శ్రీకృష్ణ కీర్తనలు | 0 | 4 |
| శ్రీసీతారామజాత్రి | 1 | 0 |
| బ్రహ్మచర్యము | 1 | 0 |
| శ్రీమన్నాటక రామాయణ భజనకీర్తనలు కో.భో. | 1 | 4 |
| కన్యకామ్మవారిపాటలు | 0 | 8 |
| శ్రీవిష్ణుసహస్రనామాలు | 0 | 4 |
| భక్తిమార్గము | 0 | 3 |
| జ్ఞానమార్గము | 0 | 3 |
| అచలగురుదర్పణము | 0 | 3 |
| గురుశిష్యసంవాదం పెద్దది | 1 | 0 |
| రసికాభిలాష | 0 | 4 |
| అరటిచెట్టుబాలశిక్ష | 0 | 2 |
| శారదాబిల్లు రూల్సు | 0 | 1 |

| వివిధరకములు. | రు. | అ. |
|---|---|---|
| అధ్యాత్మరామాయణం కీర్తనలు నాణ్యము | 0 | 8 |
| **బి. బాలాజీదాసుగారి హరికథలు.** | | |
| గయోపాఖ్యానము | 0 | 8 |
| జయప్రదాదేవి చరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| కుశలవవిజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| దయాకరవిజయము | 0 | 8 |
| రుక్మాంగద | 0 | 8 |
| త్రిశంకు విజయము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| సీతాకల్యాణము | 0 | 8 |
| ప్రియంవదచరిత్రము | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానం | 0 | 6 |
| ద్రౌపదీమానసంరక్షణం | 0 | 6 |
| కుచేలోపాఖ్యానము | 0 | 6 |
| సూరదాసు చరిత్రము | 0 | 6 |
| పురందరదాసు చరిత్రము | 0 | 6 |
| హరికథేతిహాసమంజరి 1 భా | 0 | 6 |
| డిటో రెండవభాగం | 0 | 6 |
| కర్ణానందదాయిని | 0 | 6 |
| భద్రాచల రామదాసు | 0 | 6 |
| **తిరునగరి శేషదాసుగారి హరికథలు** | | |
| శ్రీరామపాదుక | 0 | 8 |
| సుభద్రాపరిణయము | 0 | 8 |
| శ్రీమదుత్తరరామచరిత్ర | 0 | 8 |

| హరికథలు | రు. | అ. |
|---|---|---|
| సమయోచితపద్యరత్నావళి | 0 | 6 |
| **ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు.** | | |
| జానకీశపథము | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| మార్కండేయచరిత్రము | 0 | 12 |
| అంబరీషచరిత్ర | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 8 |
| ప్రహ్లాదచరిత్రము | 0 | 8 |
| భీష్మచరిత్రము | 0 | 8 |
| పైఎనిమిది పుస్తకములు కలసినక్యాలికోబయిండు | 5 | 8 |
| యథార్థరామాయణము | 2 | 8 |
| సావిత్రీ చరిత్రము | 0 | 12 |
| **బాబు. పి. యస్. న్సాషర్ వాన్ జీ కవిగారి హరికథలు.** | | |
| కబీరుదాసు చరిత్ర | 1 | 0 |
| సీతాకళ్యాణము | 1 | 4 |
| శ్రీరామజననము | 1 | 0 |
| సంగ్రహానంద రామాయణం కోసూరి భోగలింగందాసు | 1 | 4 |
| శ్రీరామకథాలహరి | 0 | 8 |
| విచిత్రకథానక్షత్రమాల | 0 | 4 |
| సగరచరిత్ర నం॥ జ॥ | 0 | 6 |
| క్షీరసాగరమథనం | 0 | 6 |

| హరికథలు | రు. | అ. |
|---|---|---|
| సుమతీదేవిహరికథ ఆ॥ పీ॥ | 0 | 4 |
| **నవలలు.** | | |
| భయంకర నారీపిశాచి | 0 | 12 |
| ప్రతాపదార్జన్యము | 0 | 12 |
| భయంకర చోరాగ్రేసర చక్రవర్తి | 0 | 12 |
| పేటికాంతరశవము భా I | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| ఇందిర | 0 | 12 |
| రక్తజ్వాల పా I | 0 | 12 |
| రక్తజ్వాల పా II | 0 | 12 |
| [illegible]గ | 0 | 12 |
| [illegible] | 0 | 12 |
| [illegible] | 0 | 12 |
| [illegible] | 1 | 0 |
| [illegible]యము | 1 | 0 |
| జపమాలిక పా I | 1 | 0 |
| జపమాలిక పా II | 1 | 0 |
| ఘోరకలి | 0 | 12 |
| వాడ్లేపిడు | 0 | 12 |
| రూపసుందరి | 0 | 12 |
| తానీషా | 1 | 0 |
| రాణీదుర్గాకుమారి | 0 | 8 |
| సమరసింహ | 0 | 8 |
| శిశుహత్య పా I | 1 | 0 |
| శిశుహత్య పా II | 1 | 0 |
| శిశుహత్య పా III | 1 | 0 |

| నవలలు. | రు. | అ. |
|---|---|---|
| బంగారు బరిణె పా I | 1 | 0 |
| బంగారు బరిణె పా II | 1 | 0 |
| చంద్రగుప్త | 0 | 8 |
| మాయామందిరము | 1 | 0 |
| ప్రణయమహిమ | 1 | 0 |
| సుధాశరశ్చంద్ర | 1 | 0 |
| రాజస్థానకథావళి పా II | 1 | 0 |
| భానుమతి | 1 | 0 |
| అగ్గిరాముడు | 0 | 8 |
| బుగ్గిరాముడు | 0 | 8 |
| దక్షిణాఫ్రికా | 2 | 0 |
| కాలూరాయి | 1 | 8 |
| కోటీశుతనయ | 1 | 0 |
| మోహలేఖావళి | 1 | 0 |
| మోహలేఖలు | 0 | 12 |
| మన్మథసామ్రాజ్యము | 0 | 12 |
| వీరఛత్రసాల్ | 1 | 0 |
| **చరిత్రలు - కథలు.** | | |
| తెనాలి రామకృష్ణ చరిత్ర | 0 | 8 |
| వేములవాడ భీమకవి | 0 | 8 |
| భట్టివిక్రమార్క చరిత్ర | 0 | 8 |
| మహాపతివ్రతలకథలు | 0 | 6 |
| దాష్ఠికపంతులు ఫార్సు | 0 | 4 |
| హరింజిప్రభువు చరిత్ర | C | 4 |
| పరీక్షిత్ జననము | 0 | 4 |
| శివాజి చరిత్రము | 0 | 2 |
| పన్నెండురాజుల కథలు | 0 | 8 |

| వైద్యగ్రంథములు. | రు. | అ. |
|---|---|---|
| ధన్వంతరివిజయము | 0 | 10 |
| నేత్రదర్పణము | 0 | 8 |
| సహదేవపశువైద్యము | 0 | 6 |
| ఆయుర్వేదవైద్యసారం | 1 | 0 |
| గృహవైద్యచికిత్సారత్నం | 1 | 0 |
| డిటో రెండవభాగము | 1 | 0 |
| అనుపానమంజరి | 0 | 8 |
| సద్వైద్యజీవనము | 0 | 8 |
| సుఖరోగచికిత్సారత్నం | 0 | 8 |
| గోసాయిచిటికలు | 0 | 8 |
| బైరాగిచిటికలు | 0 | 8 |
| ప్రసిద్ధాంగ్లేయఔషధ యోగములు | 1 | 0 |
| మనయింటి వైద్యుడు | 0 | 8 |
| అనుభవవైద్యరత్నాకరం | 0 | 12 |
| వస్తుగుణప్రదీపిక | 4 | 0 |
| స్త్రీజనకల్పవల్లి | 2 | 8 |
| వైద్యరహస్యదీపిక | 0 | 8 |
| చరకసంహిత | 6 | 0 |
| ఆయుర్వేదౌషధరత్నాకరం | 3 | 0 |
| ఆంధ్రభైషజ్యరత్నావళి | 2 | 0 |
| భస్మప్రకాశిక | 1 | 0 |
| అనుభవదీపిక | 1 | 0 |
| శార్ఙ్గధరసంహిత | 3 | 0 |
| తొట్టివైద్యము | 3 | 0 |
| వ్రణచికిత్స | 0 | 8 |

| జ్యోతిష గ్రంథములు. | | |
|---|---|---|
| అదృష్టదీపిక | 0 | 8 |
| జ్యోతిషఫలప్రదర్శని | 0 | 8 |
| కాలచంద్రిక | 0 | 4 |
| జాతక నిర్ణయము | 0 | 8 |
| జాతకమార్తాండం | 2 | 0 |
| డిటో పా II | 2 | 0 |
| డిటో పా III | 2 | 0 |
| హస్తసాముద్రికము | 0 | 4 |
| జాతకానుభవసారము | 2 | 0 |

| ఇతర రకములు | | |
|---|---|---|
| రామదాసు చరిత్ర నాణ్యం | 0 | |
| యక్షరామదాసు చరిత్ర | 0 | |
| కాలజ్ఞానతత్వాలు | | |
| స్త్రీలపాటలు బయిండు పెద్దది | | |
| డిటో రెండవభాగం | | |
| భగవద్గీతా గేయము | | |
| హస్తలాఘవము | | |
| మహాగారడి | | |
| గీతారహస్యము | 0 | |
| శివభక్తితత్వజ్ఞాన కీర్తనలు | 0 | |
| నూతనరామాయణ భజన కీర్తనలు | 0 | 6 |
| రామాయణభజనకీర్తనలు | 0 | 4 |
| శ్రీరామవనవాసము | 0 | 12 |
| పాండవ వనవాసము | 0 | 8 |
| పాండవాజ్ఞాతవాసము | 0 | 8 |

| పద్యకావ్యములు. | రు. | అ. |
|---|---|---|
| శశాంకవిజయము | 0 | 12 |
| విజయవిలాసము | 0 | 8 |
| శ్రీకృష్ణకర్ణామృతము పెద్దది | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| శతకరత్నములు భా 1 | 0 | 8 |
| డిటో రెండవభాగము | 0 | 8 |
| డిటో మూడవభాగము | 0 | 8 |
| సంపెంగ | 0 | 8 |
| హంసద్వీప మహాత్యము | 0 | 8 |
| సావిత్రీజయము | 0 | 8 |
| బలిజేపల్లిలక్ష్మీకాంతం గారిశివానందలహరిగ్లేజు | 0 | 12 |
| వేమనరత్నములు | 0 | 8 |
| భాగవతరత్నములు | 0 | 8 |
| టీకాతాత్పర్యశతకములు | | |
| గజేంద్రమోక్షము | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము | 0 | 6 |
| నరసింహశతకము | 0 | 6 |
| కృష్ణశతకము | 0 | 3 |
| వేమనశతకము | 0 | 3 |
| కుమారీశతకము | 0 | 2 |
| సుమతిశతకము | 0 | 2 |
| బాలరామాయణము | 0 | 2 |
| భాస్కరశతకము | 0 | 4 |
| దాశరధీశతకము | 0 | 4 |
| అంబరీషోపాఖ్యానము | 0 | 4 |

| వివిధరకములు. | రు. | అ. |
|---|---|---|
| దండకరత్నములు | 0 | 4 |
| హిందూస్తానీ తెల్గుబోధిని | 0 | 6 |
| స్త్రీభక్తవిజయము | 0 | 8 |
| మహాభక్తవిజయము | 0 | 8 |
| నరకమర్మములు | 1 | 0 |
| సంగీతవిద్యాదర్పణము | 3 | 0 |
| సంగీతవిద్యాదర్పణము 2భా | 1 | 0 |
| వధూవరుల ఆత్మహత్య | 0 | 2 |
| జయచంద్రరేఖావిజయం | 0 | 2 |
| తెలుగునాడు (పద్యకావ్యం) | 0 | 4 |
| శ్రీమహాభాగవతము (పద్యం) సంపన్నకుటుంబ శింగరాచార్యులు | 1 | 0 |
| అద్వైతబోధిని | 2 | 8 |
| ఇనకంటాక్సుగైడ్ | 2 | 0 |
| గణితబోధిని | 0 | 1 |
| ఎక్కములు | 3పై | |
| పెద్దబాలశిక్షలు | 0 | 2 |
| కాళిదాస భవభూతులు | 1 | 0 |
| జయదేవుచరిత్రవచనం | 1 | 0 |
| కుశలవోపాఖ్యానము | 0 | 4 |
| స్త్రీలపత్రికకధలు 1భా | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |
| డిటో మూడవభాగము | 0 | 6 |
| గీతరత్నహారము | 0 | 8 |
| దస్తావేజుల మతలబులు | 0 | 12 |

## స్త్రీల పాటలు

| | రు. | అ. |
|---|---|---|
| కూలి సుబ్బారావుపాటలు. | | |
| మొదటిభాగము | 0 | 12 |
| డిటో. రెండవభాగం | 0 | 12 |
| వేడుక పెండ్లిపాటలు | 0 | 8 |
| సుహిళామనోరంజనీపాటలు | 0 | 5 |
| కామేశ్వరారావు పాటలు | 0 | 5 |
| కుశలవులయుద్ధం (నాట్యం) | 0 | 8 |
| శారదరామాయణము | 0 | 2 |
| కుశలవకుచ్చులచరిత్ర | 0 | 8 |
| డిటో. చిన్నది | 0 | 4 |
| కుసలాయకము | 0 | 3 |
| లంకాయాగము | 0 | 2 |
| శాంతగోవిందనామాలు | 0 | 1 |
| అడవిగోవిందనామాలు | 0 | 1 |
| లక్ష్మణమూర్ఛ | 0 | 1 |
| లక్ష్మణ దేవరనవ్వు | 0 | 1 |
| రుక్మిణీదేవి సీమంతము | 0 | 1 |
| కాళింగమడుగు | 0 | 1 |
| ఊర్మిళా దేవినిద్ర (నాట్యం) | 0 | 1 |
| అప్పగింతలపాట | 0 | 1 |
| మంగళహారతులు | 0 | 1 |

| | రు. | అ. |
|---|---|---|
| మేలుకొలుపులు నాట్యం | 0 | 1 |
| గంగా గౌరీసంవాదము ,, | 0 | 1 |
| శ్రీకృష్ణజననము ,, | 0 | 1 |
| చిలుకరాయబారము ,, | 0 | 1 |
| ధర్మరాజు జూదము ,, | 0 | 1 |
| చిలుకముగ్గుల పాటలు ,, | 0 | 1 |
| నలుగుపాటలు ,, | 0 | 1 |
| కొండ్లి గోవిందనామాలు ,, | 0 | 1 |
| తులసిగోవిందనామాలు ,, | 0 | 1 |
| సీతాదేవి వేవిళ్ళు ,, | 0 | |
| సీతాదేవి అగ్నిప్రవేశము ,, | 0 | |
| **పోస్టు పుస్తకములు.** | | |
| బాలకృష్ణలీలలు | 0 | 1 |
| గోవిందంపాట | 0 | 1 |
| దశావతారములు | 0 | 1 |
| గుమ్మా గుమ్ హాస్య పాటలు | 0 | 1 |
| పక్కు బాయి కీర్తనలు | 0 | 1 |
| సంసారవిముక్తి కీర్తనలు | 0 | 1 |
| గుల్ మోహనరంగ పాట | 0 | 1 |
| ఆంజనేయ దండకము | | పై 3 |
| శ్రీరామదండకము | | పై 3 |
| కనకదుర్గ దండకము | | పై 3 |

ఈ పుస్తకములే గాక ఇంకా మావద్ద అనేకరకములు గలవు. కావలసినవారికి భారీగా ఆర్డరు యిప్పించ కోరెదము. ఈ క్రిందగుర్తించిన ధరలన్నియు ప్రస్తుతము అమలులో యున్న ధరలయి యున్నవి. క్రొత్త ఖాతాదారులు ఆర్డరుతో నాల్గవవంతు సొమ్ము అడ్వాన్సుగా పంపవలెను. అడ్వాన్సులేని ఆర్డరు పంపబడవు కోరినవారికి మాకం పైన 100 పేజీలు కేటలాగు ఉచితముగా పంపగలము.

ఇట్లు

కురుకూరి సుబ్బారావు:— బెజవాడ

# సుప్రసిద్ధ నాటకములు

బెజవాడ మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపబడునవి.

| | |
|---|---|
| రంగూన్ రౌడీ (పతిభక్తి) సో॥ రా॥ | 1-0-0 |
| భీష్మబ్రహ్మచారి డిటో | 1-0-0 |
| గంగావతరణము డిటో | 1-0-0 |
| ధరణికోట (రెడ్డిప్రతాపము) | 1-4-0 |
| ద్రౌపదీవస్త్రాపహరణము మ॥ అ॥ | 1-0-0 |
| పత్నీప్రతాప్ అనసూయ సో॥ అ॥ | 1-0-0 |
| శ్రీకృష్ణతులాభారం ము॥ సు॥ | 1-0-0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0-12-0 |
| పాదుకాపట్టాభిషేకము డిటో | 1-4-0 |
| చింతామణి కా॥ నా॥ | 1-0-0 |
| మధుసేవ డిటో | 1-0-0 |
| జయంతజయపాలం అ॥ స॥ | 0-12-0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ క॥ | 1-0-0 |
| కృష్ణలీల బళ్ళారి కే॥ సు॥ | 1-'-0 |
| లవకుశ డిటో | 1-'-0 |
| రామదాసు బళ్ళారిడి॥ గో॥ | 1-0-0 |
| రామకబీరు డిటో | 1-'-0 |
| రసపుత్రవిజయం ఇ॥ య॥ | 1-0-0 |
| రాణా ప్రతాప్‌సింగ్ డిటో | 1-0-0 |
| సంపూర్ణభారతం బళ్ళారి | 1-0-0 |
| తాజ్ మహల్ సో॥ రా॥ | 1-0-0 |
| కనకతార చం॥ కే॥ | 1-'-0 |
| సావిత్రిసాంగ్సు పా॥ కాం॥ | 0-12-0 |
| ద్రౌపదీవస్త్రాపహరణంసాంగ్సు | 0-1'-0 |
| ప్రహ్లాదసాంగ్సు డిటో | 0-1'-0 |
| రాధాకృష్ణసాంగ్సు చం॥ కే॥ | 0-12-0 |
| తులాభారంసాంగ్సు డిటో | 0-12-0 |
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 0-8-0 |
| ప్రసన్నయాదవము డిటో | 0-8-0 |
| పారిజాతాపహరణము డిటో | 0-8-0 |
| భక్తకబీర్ కా॥ స॥ | 1-0-0 |
| పాదుకాపట్టాభిషేకం డిటో | 1-0-0 |
| కాంతామతి బ॥ గో॥ | 0-12-0 |
| శ్రీకృష్ణరాయబారం | 0-12-0 |
| రోషనార జహ్వారిభాయి | 0-12-0 |
| సంపూర్ణరామాయణము | 1-0-0 |
| కుశలవ జ॥ ల॥ | 0-12-0 |
| పద్మవ్యూహము మ॥ స॥ | 1-0-0 |
| ఉషాపరిణయము | 0-12-0 |
| చండిక ము॥ వేం॥ | 1-0-0 |
| శ్రీరామాంజనేయం పి॥ చి॥ | 1-0-0 |
| శ్రీమతీదేవి శ్రీ॥ త్రి॥ | 1-0-0 |
| రాధాకృష్ణలీలలు కం॥ వే॥ | 0-12-0 |
| సతీఅనసూయ అ॥ సో॥ | 0-12-0 |
| మహానంద ద్రో॥ సీ॥ | 0-12-0 |
| వృద్ధవివాహము గో॥ వేం॥ | 0-12-0 |
| కనకతార ము॥ చం॥ | 0-12-0 |
| రామదాసు రా॥ నా॥ | 1-0-0 |
| సతీఅనసూయ సో॥ రా॥ | 1-0-0 |
| ప్రతాపరుద్రీయము | 1-0-0 |
| సంగీతకళారేఖ | 0-12-0 |
| అలీబాబా 40 దొంగలు | 0-12-0 |
| సత్యహరిశ్చంద్ర | 1-0-0 |
| భోజకాళిదాసు | 1-0-0 |
| సంపూర్ణభక్తవిజయం | 1-0-0 |
| మారుతీమైరావణ | 0-12-0 |

వలయువారు:—

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TDLA 101 B 15 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 2[illegible]/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | prathyusha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | LAKSHMI |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |